# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి దంతక్షయాన్ని నివారించండి!




ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.

కాల్గేట్ 10 మందిలో 7 గురి చెడ్డ శ్వాసను వెంటనే అరికట్టినదని మరియు కాల్గేట్ పద్ధతితో భోజనానంతరం పళ్ళు తోము కొనుట వల్ల దంత శాస్త్ర చరిత్రలో మునుపు ఎప్పుడూ ఎరుగనంత ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని శాస్త్ర పరీక్షలు నిరూపించాయి! కోల్గేట్‌లో మాత్రమే యీ ఋజువు ఉన్నది.

ఎంతో చక్కని పిప్పరమెంటు రుచి కూడా— కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకోవటం పిల్లలకు చాలా ఇష్టం.




మీకు పౌడరు కావాలంటే, ఈ ప్రయోజనాలన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడరు వల్ల పొందండి... ఒకడబ్బా నెలల తరబడి వస్తుంది!




ఇప్పుడు!
సూపర్ సైజే
కొని ...డబ్బు పొదుపు
చేయండి!

శుభ్రతకు, తాజా శ్వాసకు, ధవళ దంతాల కోసం...
ప్రపంచంలోని ఏ ఒక్క ఇతర టూత్‌పేస్టు కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DC.G.38 TEL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటో శీరికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.




నిర్మాతలు: కె. సీతారామస్వామి, జి. సుబ్బారావు దర్శకత్వం: బి. విఠలాచార్య

ఆంధ్ర: విజయా కంబైన్స్ · సీడెడ్: జయలక్ష్మి · నైజాం: దివ్యచిత్ర · మైసూర్: నవరంగ్ పిక్చర్స్ · · చిత్తూరు జిల్లా: క్రిష్ణవేణి పిక్చర్స్

THERE IS
MORE THAN MALT
IN *Maltex*

SATHE *Maltex* BISCUITS

You'll wonder how a biscuit could be so good. Besides being rich in malt, Maltex is pleasantly flavoured and specially baked for easy digestion; so it's kind to convalescents and children at the same time. Now in the 'New Look' pack, Maltex Biscuits are ideal for the family.

SATHE BISCUIT &
CHOCOLATE CO. LTD.,
POONA-2.






# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ ["రహస్యం"]కు ఆధారం కుమారి మత్స శివగంగ పంపిన కథ.

యశస్కరుడి కథ కల్హణుడి రాజతరంగిణిలోది. రాజతరంగిణి అన్నది కాశ్మీరురాజుల చరిత్ర. ఈ యశస్కరుడు చేసిన మరొక న్యాయనిర్ణయం గురించి పై మాసం ప్రకటిస్తాము.

మనం చెయ్యవలసిన పనులు మరొకరికి పురమాయించటం అవివేకం అన్న నీతి "రాజుగారి వైరాగ్యం" లో చూడవచ్చు.

సంపుటి 45 జూలై '69 సంచిక 1








# పేదిమూతివాడు

ఒకప్పుడు ఒకరాజు దేశాటనకు బయలు దేరాడు. తిరిగి తిరిగి అతనికి ప్రాణం విసిగింది. ఆయన ఒక వితంతువు ఉంటున్న ఇంటికి ఆకలితో వచ్చాడు. వితంతువు చాలా చక్కనిది. రాజుకు అన్ని ఉపచారాలూ చేసింది. రాజుకు ఆ ఇల్లు విడిచి పో బుద్ధి కాలేదు. వితంతువును పెళ్ళాడి అక్కడే కొంతకాలం ఉండి పోయాడు. వాళ్ళిద్దరికీ ఒక కొడుకు పుట్టాడు.

ఒకనాడు రాజు తన భార్యతో, "నేను నా దేశం విడిచి వచ్చి చాలా కాలమయింది. తిరిగి వెళ్ళాలి. మన కొడుకును శ్రద్ధగా పెంచు. వాడు ఎప్పుడు పెద్దవాడైనట్టు తోస్తే అప్పుడు వాణ్ణి నా దగ్గిరికి పంపించు. వాణ్ణి నేను గుర్తించటానికి వీలుగా ఈ పతకం ఇచ్చి పంపు. అది చూడగానే నేను వాణ్ణి యువరాజు చేస్తాను," అని వెళ్ళిపోయాడు.

ఏళ్ళు గడిచాయి. కుర్రవాడు పెరిగి పెద్దవాడయాడు. ఒకనాడు వాడు తన తల్లిని, "అమ్మా, నా తండ్రి ఎవరు?" అని అడిగాడు.

ఇక వాణ్ణి తండ్రి దగ్గిరికి పంపవచ్చు ననుకుని వాడి తల్లి, వాడికి రాజు ఇచ్చిన పతకం ఇచ్చి, "నీ తండ్రి ఫలాని దేశానికి రాజు. ఈ పతకం చూపించావంటే నిన్ను గుర్తించి, యువరాజును చేస్తాడు. కాని ఒక్కటి గుర్తుంచుకో, దారిలో పేడిమూతి వాడు ఎదురైనట్టయితే వెనక్కు తిరిగి వచ్చెయ్యి," అన్నది.

కుర్రాడు బయలుదేరి తన తండ్రి ఏలే రాజ్యాన్ని చేరుకున్నాడు. సరిగా అదే సమయానికి పేడిమూతి వాడొకడు వస్తూ వాడికి ఎదురుగా కనిపించాడు. వెంటనే కుర్రవాడు వెనక్కు తిరిగి, తల్లి వద్దకు వెళ్ళిపోయి, జరిగినది చెప్పాడు.

ఆర్. పాండురంగయ్య



"మంచిపని చేశావురా, బాబూ," అన్నది తల్లి.

ఒక నెల ఆగి వాడు మళ్ళీ ప్రయాణ మయాడు. కాని ఈసారి కూడా రాజ్యం పొలిమేర వద్ద పేడిమూతి వాడొకడు ఎదురు వచ్చాడు. కుర్రాడు తల్లి వద్దకు తిరిగి వెళ్ళిపోయాడు.

ఇంకో మాసం ఆగి కుర్రవాడు మళ్ళీ తండ్రి దగ్గిరికి బయలుదేరాడు. ఈసారి వాడు రాజ్యంలోకి ప్రవేశించి కొంతదూరం నడిచి, ఒక చెట్టు కింద అరుగు ఉంటే దాని మీద కూర్చుని ఆయాసం తీర్చుకో సాగాడు. అసలే వేసవికాలం. పొద్దు బాగా ఎక్కింది.

వాడలా కూర్చుని ఉండగా, తాను వచ్చిన దారి వెంబడే వస్తూ పేడిమూతి వాడొకడు కనిపించాడు.

"ఈ పేడిమూతి వెధవ నన్ను విడవ కుండా ఉన్నాడే. ఈసారి నేను వెనక్కి తిరిగి పోను. అయినా ఈసారి వాడు నాకు ఎదురు రాలేదు గద! నేను తిరిగి పోను!" అని గట్టిగా పైకే అన్నాడు కుర్రవాడు.

ఈలోపల పేడిమూతివాడు దగ్గిరి కొచ్చి, "ఏమిటో అంటున్నావు?" అని అడిగాడు.

కుర్రవాడు అమాయకంగా తన కథంతా ఆ పేడిమూతి వాడికి చెప్పాడు. రాజు



తనకు గుర్తుగా ఇచ్చిన పతకం మాట మాత్రం చెప్పలేదు.

"నేనూ రాచనగరు కేసే పోతున్నాను. ఇద్దరమూ కలిసే పోవచ్చు. ఇంతకూ రాజు గారు నిన్ను చూశాడా?" అన్నాడు పేడి మూతివాడు.

"పసివాణ్ణిగా చూశాడు. ఇప్పుడు గుర్తించ లేడు," అన్నాడు కుర్రాడు.

ఇద్దరూ కలిసి కొంత దూరం నడిచారు. ఎండవల్ల ఇద్దరికీ నోరు ఆర్చుకు పోతున్నది. ఒకచోట దారి పక్కనే దిగుడుబావి కని పించింది. దాని మెట్లు నిటారుగా ఉన్నాయి. అడుగున కొద్దిగా నీరున్నది.



పేడిమూతివాడు అందులోకి తొంగి చూసి, "నీరున్నదిగాని, అది తెచ్చుకునే దెలా?" అన్నాడు.

"నేను తెస్తాను," అంటూ కుర్రాడు తన వెంట తెచ్చుకున్న తాబేటికాయతో సహా బావిలోకి దిగాడు. పేడిమూతివాడు బావి మీద ఒక రాతిపలక అడ్డంపెట్టి, "దొరి కొపు లేరా, బుద్ధిహీనుడా!" అన్నాడు.

కుర్రాడు తన అసహాయస్థితి తల్చుకుని ఏడుస్తూ, "నన్ను పైకి రానీ," అని కేకలు పెట్టాడు.

"నేను చెప్పినట్టు వింటానని ప్రమాణం చేస్తే రానిస్తాను. మనం రాజుగారి దగ్గిరికి వెళతాం. నేను రాజుకొడుకు ననీ, నువు నా భటుడివనీ చెబుతాను. నువు నిజం చెప్పరాదు," అన్నాడు పేడిమూతివాడు.

"నా బొందెలో ప్రాణం ఉండగా చెప్పను," అని కుర్రాడు తన తల్లి మీదా తండ్రి మీదా ఒట్టువేసుకున్నాడు.

తరవాత ఇద్దరూ రాజభవనం చేరారు. పేడిమూతివాడు తానే రాజుకొడుకు ననీ, తన తల్లి ఫలానా గ్రామంలో ఉన్నదనీ రాజుతో అన్నాడు. రాజు వాడి మాటలు నమ్మి కావిలించుకున్నాడు. ఆయన తా నిచ్చిన పతకం చూపమని అనలేదు. ఆ పతకం మాట ఆయనకు జ్ఞాపకమే లేదు. ఆయన వాడికి రాజభవనమంతా చూపించి, ఆ రాత్రికి వాణ్ణి ప్రత్యేకమైన పడకగదిలో, వెండి మంచం మీద పడుకోబెట్టాడు.

ఆ రాత్రి పేడివాడికి నిద్రపట్టలేదు. రాజ వైభవమంతా చూశాక, రాజుగారి అసలు కొడుకు రాజుతో నిజం చెప్పేసి, తన కిదంతా లేకుండా చేస్తాడేమో నన్న దిగులు వాడికి మనోవ్యాధిలా పట్టుకుంది. ఆ కుర్రాణ్ణి శాశ్వతంగా వదిలించుకునే ఉపాయం ఆలోచించాడు.

మర్నాడు ఉదయం రాజుగారు పిలిచి, "రాజభవనంలో సౌకర్యాలూ అవీ నీకు

నచ్చాయా?" అని అడిగితే, పేడివాడు, "అంతా దివ్యంగా ఉంది. వంక పెడితే ఒక్కందుకే వంక పెట్టాలి," అన్నాడు.

"ఏమిటది?" అని రాజు అడిగాడు.

"ఈ ఇంట జగదేకసుందరి లేకపోవటమే లోటు. ఆమె వచ్చిందంటే మన ఇల్లు ఇంద్రభవనమే!" అన్నాడు పేడివాడు.

"ఆ జగదేకసుందరి ఎక్కడున్నదో వెతికి ఎవరు తెస్తారు?" అన్నాడు రాజు.

"నా నౌఖరును పంపిస్తాను," అన్నాడు పేడివాడు. తరవాత వాడు రాజకుమారుణ్ణి కలుసుకుని, "జగదేకసుందరిని నీవు తీసుకురావాలని రాజుగారి ఉత్తరు వయింది. ఒక గుర్రాన్ని ఇప్పిస్తాను. వెంటనే బయలుదేరు," అన్నాడు.

కుర్రాడు కంగారుపడి, "జగదేకసుందరి ఎవరో, ఆమె ఎక్కడుంటుందో నా కేం తెలుసు?" అన్నాడు.

"అయితే, వెళ్ళనన్నావని రాజుగారితో చెప్పనా? ఆయన నీ తల తీసేయిస్తాడు," అన్నాడు పేడివాడు.

గత్యంతరం లేక రాజకుమారుడు పేడివాడిప్పించిన గుర్రాన్ని ఎక్కి నగరం దాటి వెళ్ళాడు. నగరం దాటగానే వాడికి విపరీతమైన భయం పట్టుకున్నది. వాడు ఒక చెట్టు కింద కూర్చుని ఏడవసాగాడు.





ఒక ముసలిది వాడి పక్కనే నిలబడి, "ఎందుకు, నాయనా, ఏడుస్తున్నావూ?" అని అడిగింది.

కుర్రవాడు అంతా చెప్పాడు.

"ఈ మాత్రానికే అధైర్యపడతావా? జగదేకసుందరి ఉండే చోటు చేరటం ఏమంత కష్టం కాదు. ప్రమాదాలన్నీ దారిలోనే ఉన్నాయి. నువు జగదేకసుందరి కోట చేరేసరికి అమావాస్య అవుతుంది. అది గుర్తుంచుకో. నీకు దారిలో కొన్ని సింహాలు ఎదురై, నిన్ను మింగబోతాయి. అమావాస్య నాటి రాత్రి ఆ సింహాలను జగదేకసుందరి కోటకి రమ్మను; అవి కోరినంత ఆహారం పెడతానని చెప్పు. మరికొంత దూరం పోతే నీకు గండుచీమల దండు ఎదురవుతుంది. అవి నిన్ను పీక్కు తినబోతాయి. వాటిని పాడ్యమి రాత్రికి కోటకి రమ్మను. ఆ తరవాత తేనెటీగల దండు నీ మీద ముసురుతుంది. వాటిని విదియ నాటి రాత్రి రమ్మను. ఈ గండాలు గడిచినాక ఏం చెయ్యాలో నువే నిర్ణయించుకో," అని ముసలిది ఎటో వెళ్ళిపోయింది.

అంతా ముసలిది చెప్పినట్టే జరిగింది. రాజు కొడుకు దారిలో కనిపించిన సింహాలకూ, చీమలకూ, తేనెటీగలకూ ముసలిది చెప్పమన్నట్టే చెప్పి, అమావాస్య నాటికి జగదేకసుందరి కోట చేరాడు.

కోటద్వారం వద్ద నూరుమంది పర్వతాకారులు కాపలా ఉన్నారు. వాళ్ళు కుర్రాణ్ణి చూసి, "ఏం పని? ఏం కావాలి నీకు?" అని అడిగారు.

"నాకు జగదేకసుందరి కావాలి," అన్నాడు కుర్రాడు.

వాళ్ళు విరగబడి నవ్వి, "ఇంకా నయం! పద పద! జగదేకసుందరి అడగగానే దొరుకుతుందనుకున్నావా? ఎన్ని అసాధ్యమైన పనులు చేస్తే దొరుకుతుందనుకున్నావు? వచ్చిన దారి పట్టు," అన్నారు.






"నేను జగదేకసుందరిని వెంటబెట్టుకుని గాని పోను," అన్నాడు కుర్రాడు.

"అయితే నీ కర్మ అనుభవించు," అంటూ వాళ్ళు వాణ్ణి కోటలో ఒక పెద్దగదికి తీసుకుపోయి, నలభై గంగాళాల నిండా పేర్చి వున్న మాంసం చూపించి, "తెల్లవారేలోగా ఇదంతా తిను. తినలేకపోతే నీ మెడ మీద రేపు తల ఉండదు," అని వెళ్ళిపోయారు.

కుర్రాడు మొదట కుంగిపోయాడు. తరవాత వాడికి సింహాలను ఈ రాత్రికే రమ్మన్న మాట గుర్తు వచ్చింది. అవి వస్తాయో రావో అని భయపడ్డాడు. కాని అవి రానూ వచ్చాయి. మాంసమంతా ఖాళీచేసి పోనూ పోయాయి. ద్వారం వద్ద ఉన్న బలశాలులను అవి ఎలా కన్నుకప్పాయో తెలియలేదు.

మర్నాడు కాపలావాళ్ళు వచ్చి గంగాళాలు ఖాళీగా ఉండటం చూసి, "చూడటానికి అర్భకుడల్లే ఉండి, ఎంత పని చేశాడూ!" అనుకున్నారు.

వాళ్లు ఆ కుర్రాణ్ణి మరొక గదికి తీసుకుపోయారు. ఆ గదిలో ధాన్యం పెద్ద రాశి పోసి ఉంది. మర్నాడు ఉదయం లోపుగా ఆ ధాన్యమంతా తినకపోతే తల పోతుందని కుర్రాణ్ణి హెచ్చరించి వాళ్లు వెళ్లిపొయ్యారు. ఆ రాత్రి కోట్లకొద్దీ చీమలు వచ్చి ఒక్క గింజ మిగల్చకుండా అన్నిటినీ పట్టుకుపోయాయి.

మూడోరోజు కాపలావాళ్లు కుర్రాణ్ణి నలభై జాడీల నిండా తేనె ఉన్న గదికి తీసుకుపోయి, తెల్లవారే లోపుగా అది అంతా తాగెయ్యమన్నారు. తేనెటీగలు అసంఖ్యాకంగా వచ్చి ఆ తేనె అరగించి వెళ్లిపోయాయి.

మూడు పరీక్షలూ గడిచి రాజుకొడుకు జగదేకసుందరిని గెలుచుకున్నాడు. వాడామెను తన గుర్రం మీదనే ఎక్కించుకుని రాజుగారి ఇంటికి బయలుదేరాడు.



పేడిమూతివాడు ఆ సమయానికి కోట గోడ మీది బురుజులో ఉండి, రాజ కుమారుడు జగదేకసుందరిని నిజంగానే తెస్తూ ఉండటం చూసి, ప్రాణం కడబట్టి నంత పని చేశాడు. వాడు రాజకుమారుణ్ణి దగ్గిరికి రానిచ్చి, "ఓరే, అబ్బీ! ఆ అమ్మా యిని తీసుకుని పైకి రా!" అన్నాడు.

ఇద్దరూ మెట్లెక్కి బురుజులోకి రాగానే పేడివాడు జగదేకసుందరి చెయ్యి గట్టిగా పట్టుకుని, "త్వరగా రా, మనం వెంటనే పెళ్లాడేద్దాం!" అన్నాడు.

ఆమె తన చెయ్యి విదిలించుకుని, "ఛీ, నన్ను గెల్చుకున్నవాణ్ణే నేను పెళ్ళాడతాను. పో అవతలికి!" అన్నది.

పేడిమూతివాడు రాజకుమారుణ్ణి అమాంతం ఎత్తి కిందికి విసిరి, "ఇప్ప డన్నా నన్ను పెళ్ళాడతావా?" అని ఆమెను అడిగాడు. జగదేకసుందరి వాడికి జవాబు చెప్పక, గబగబా మెట్లు దిగి కిందికి వెళ్ళి, తన జుట్టుముడి నుంచి సంజీవిపుల్ల తీసి, రాజకుమారుడి శరీరానికి తాకించింది. దాంతో రాజకుమారుడు మళ్ళీ బతికాడు.

వాడు కళ్ళు తెరిచి జగదేకసుందరితో, "అంత ఎత్తు నుంచి పడినా నేను చావక పోవటం చిత్రం కాదూ?" అన్నాడు.

"నువ్వు చచ్చిపోతే నేను బతికించు కున్నాను," అన్నది జగదేకసుందరి.

"నేను నిజంగా చచ్చి బతికానా? అలా అయితే ఆ పేడివాడికి చేసిన ప్రమాణం చెల్లదు. ఇప్పుడే రాజుగారితో నిజం చెప్పే స్తాను," అంటూ వాడు జగదేకసుందరిని వెంట బెట్టుకుని రాజు వద్దకు వెళ్ళి, అంతా చెప్పి, తన వద్ద ఉన్న పతకం చూపాడు.

"ఆ దుర్మార్గుణ్ణి కొరత వేయిస్తాను," అని రాజుగారు అన్నాడు గాని, ఎంత వెతికినా పేడివాడి జాడలేదు. రాజు తన కొడుకును యువరాజుగా పట్టాభిషేకం చేసి, జగదేకసుందరితో వివాహం కూడా జరిపాడు.






## 19

[శిఖిముఖీ, విక్రమకేసరీ తమ అనుచరులతో శిథిలాలయ పూజారి వున్న ఇంటిని చుట్టు ముట్టి నాగుమల్లిని బంధవిముక్తురాల్ని చేశారు. పూజారి, నవరభేరుండంతో అరణ్యం లోకి పారిపోయాడు. నాగుమల్లి, శిఖిముఖితో అతడు బ్రహ్మపుత్రా నదీ లోయల నుంచి తిరిగివచ్చేవరకూ తాను పెళ్ళాడబోవటం లేదని చెప్పింది. తరవాత—]

శివాలుడు తన అనుచరులందరినీ వెంట బెట్టుకుని మధ్యాహ్నం వేళకు కుంభార మిట్టపల్లె చేరాడు. తాను పల్లెలో లేని సమయాన శిథిలాలయ పూజారి పల్లెపై ఏదైనా అఘాయిత్యం చేసివుండవచ్చన్న భయం అతణ్ణి దారి పొడుగునా బాధిం చింది. కాని పల్లె చేరుతూనే అలాంటి ఉపద్రవం ఏమీ జరగలేదని తెలిసి, అతడు చాలా సంతోషించాడు.

ఇన్నాళ్ళకు శివాలుడికి, విక్రమకేసరి తండ్రి జయపాలుడు తనకు పంపిన తాళ పత్రాలు తీరిగ్గా చదివిచూసే అవకాశం దొరికింది. జయపాలుడి తండ్రి విక్రమ కేసరి రెండవసారి బ్రహ్మపుత్రా లోయలకు ఎందుకు వెళ్ళటం జరిగిందో, వాటిల్లో అతడికి సూచనప్రాయంగా వున్న కొన్ని స్థలాల పేర్ల ద్వారా అర్థమైంది. అతడు యీ రెండవ యాత్ర పెట్టుకున్నది, బ్రహ్మ





పుత్రానది లోని అసంఖ్యాకమైన లంకల్లో ఒకటైన వృశ్చికలంక చేరేందుకు. ఆ లంక మీదే శిథిలాలయం వున్నదని వాడుక. అందులో అంతులేని ధనకనకాలే కాక, వెలలేని శిల్పసంపద కూడా వున్నదని చెపుతారు. విక్రమకేసరి ఆ ధనాన్నీ, వీలయితే అపూర్వకళాఖండాలుగా చెప్పబడే శిల్పాలనూ తీసుకువచ్చి తన రాజభవనాన్ని అలంకరింప చేయాలనుకున్నాడు.

తాళపత్రాల్లో విక్రమకేసరి ఆ శిథిలాలయాన్ని చేరేందుకు తనకు తెలిసిన వర్తమానమంతా రాశాడు. ఆ దేవాలయం ఇభ్యు లనబడే ఆటవికులు కొన్ని వందల సంవత్సరాల క్రితం నిర్మించినది. ప్రకృతి వైపరీత్యాలవల్లా, బ్రహ్మపుత్ర వరదలవల్లా, ఆ లంక చుట్టుపక్కల చాలా ప్రాంతం జలమయం అయిపోయి, కొన్నేళ్ళుగా ఆ దేవాలయం వున్న లంక ఎక్కడున్నదో కూడా ఎవరికీ తెలియకుండా పోయింది. కాని, ఇభ్యుజాతి వాళ్ళలో కొందరు వృద్ధులకు మాత్రం ఆ శిథిలాలయం వున్న లంకను గురించిన సమాచారం కొంతలో కొంత తెలుసునన్న వాడుక వున్నది.

శివాలుడు, వందల సంఖ్యలో వున్న తాళపత్రాల్లో అక్కడా యిక్కడా వున్న శిథిలాలయానికి సంబంధించిన విషయాన్ని విక్రమకేసరికి చెప్పి, "కేసరీ, మీ తాతగారైన విక్రమకేసరి దొర యింకా సజీవుడే అన్న నమ్మకం నాకు లేదు. ఆయన వయసులో నా కన్న చాలా పెద్ద. అంతే కాక ఆ లోయల్లో ఒంటరిగా తిరుగుతూ విషజ్వరాలకూ వాటికీ గురై యింతకాలం సజీవుడై వుంటాడని నేననుకోను. ఏమైనా, సంగతి మీ నాయనగారితో చెప్పు. ఆయన ఆ ప్రాంతాలకు వెళ్ళితీరాలంటే మనం చేయుగలిగిందేమీ లేదు. నీకు తోడుగా శూరసేనదేశం వరకే గాక, ఆ బ్రహ్మపుత్రా



నదీ లోయలకు కూడా నా కొడుకు శిఖి ముఖిని పంపుతున్నాను," అన్నాడు.

విక్రమకేసరి, శివాలుడికి కృతజ్ఞత తెలియపరిచాడు. మర్నాటి ఉదయం అతడు శిఖిముఖిని వెంటబెట్టుకుని తన దేశానికి బయలుదేరాడు. దారిలో దొంగల బెడదగాని, శిథిలాలయ పూజారి నుంచి ఏమైనా ఆపదగాని రావచ్చునన్న అను మానంతో శివాలుడు వారి వెంట దృఢ కాయులైన యిద్దరు శబరయువకుల్ని అంగరక్షకులుగా పంపాడు.

మార్గమధ్యంలో ఎలాంటి చిక్కులకూ గురి కాకుండానే పక్షం రోజుల తరవాత శిఖిముఖీ, విక్రమకేసరీ శూరసేనదేశం చేరారు. జయపాలుడు విక్రమకేసరి ద్వారా సంగతి సందర్భాలన్నీ తెలుసుకుని, ఎంత ప్రమాదంతో కూడిన కార్యం అయినా సరే, తాను తప్పక బ్రహ్మపుత్రానదీ లోయ లకు పోయి, తన తండ్రి సజీవుడో కాదో అన్న సంగతి తెలుసుకు తీరాలన్నాడు.

జయపాలుడి ఆలోచనకు మంత్రీ, యితర రాజోద్యోగులూ అభ్యంతరం చెప్పారు. ఇటువంటి కష్టసాధ్యమైన పనికి యువకుడే తగినవాడనీ, ఈ వయసులో జయపాలుడు అంత దూరప్రయాణానికి



పూనుకోవటం క్షేమంకాదనీ సలహా యిచ్చారు. వారి సలహాను పాటించి జయ పాలుడు తన కొడుకైన విక్రమకేసరి పైన యీ కార్యభారం పెట్టాడు.

ప్రయాణానికి అవసరం అయిన ఏర్పా ట్లన్నీ ఒక వారం రోజుల్లో పూర్తయినై. విక్రమకేసరీ, శిఖిముఖుల వెంట రక్షణగా జయపాలుడు సుశిక్షితులైన ఇద్దరు క్షత్రియ యువకుల్ని పంపేందుకు ఏర్పాటు చేశాడు. అందరూ ఒకనాటి ప్రాతఃకాలాన బ్రహ్మ పుత్రానదీ లోయలకు ప్రయాణం అయారు. బయలుదేరే ముందు జయపాలుడు శిఖి ముఖిని ఆప్యాయంగా కౌగలించుకుని,



అతడి మెడలో ఒక రక్షరేకు కట్టాడు. అది జయపాలుడికి తన తండ్రి నుంచి లభ్యమయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరికింది. దాని మీద కాళీమాత రూపం చెక్కబడి వున్నది.

శిఖిముఖీ, విక్రమకేసరులు తమ యిద్దరు సహచరులతో నాలుగైదు నెలల కాలం అరణ్యాల్లో, కొండల్లో ప్రయాణించి, చిన్నాపెద్ద నదులను అనేకం దాటి చివరకు కామాఖ్యపురం చేరారు. అక్కడ కొద్ది రోజులపాటు విశ్రాంతి తీసుకుని తరవాత దారిచూపే వాణ్ణెవణ్ణయినా కుదుర్చుకుని ఇఖ్యజాతి వాళ్ళుండే ప్రాంతం చేరాలని వాళ్ళు నిర్ణయించుకున్నారు. తాత విక్రమకేసరి యీ జాతివాళ్ళు నివసించే ప్రాంతాల కొంతకాలం వున్నట్టు శూరసేన దేశపు పండితుడు జయపాలుడికి లోగడ చెప్పి వున్నాడు.

విక్రమకేసరీ అతడి అనుచరులూ కామాఖ్యపురం చేరి, ఒక సత్రంలో బస చేశారు. ఆ సమయాన పట్టణంలో దేవీ ఉత్సవాలు జరుగుతున్నవి. అవి చూసేందుకు చుట్టుపక్కల పదీ పన్నెండు కోసుల దూరం నుంచి కూడా జనం వస్తున్నారు. వీళ్ళల్లో అనేక తెగలవాళ్ళూ, జాతుల వాళ్ళూ వున్నారు. బ్రహ్మపుత్రా నదీ లోయల్లో దారి చూపేందుకు నమ్మకస్థుడైనవాడి కోసం వెతకటానికి యిది మంచి అదనుగా శిఖిముఖికి తోచింది. అతడు విక్రమకేసరినీ, తతిమ్మా యువకుల్ని వెంటబెట్టుకుని ఉత్సవం జరుగుతున్న ప్రాంతానికి బయలుదేరాడు. వీధులకు యిరువైపులా చిన్నచిన్న దుకాణాలు అనేకం వాళ్ళ కంటబడినై. ఆ దుకాణాల్లో ఏనుగు దంతంతో చేసిన రకరకాల వస్తువులూ, పాలరాతితో చెక్కిన విగ్రహాలూ, జంతు చర్మాలతో తయారైన సామగ్రులూ అమ్ముతున్నారు.



నలుగురు యువకులూ ఆ దుకాణాల్లోని విచిత్ర వస్తువులను చూస్తూ ముందుకు కదిలారు. వాళ్ళకు ఒక వీధి మలుపున ఏనుగుచర్మాలు పరుచుకుని వాటి మీద మానవాస్థికలు పెట్టుకు కూర్చున్న ఒక జ్యోతిష్యుడు కనిపించాడు. పెద్ద గడ్డం, జడలు కట్టిన తల వెంట్రుకలతో, ముఖాన ఎర్రని పెద్ద కుంకంబొట్టుతో, అతడు చూప రుల్ని బాగా ఆకర్షిస్తున్నాడు.

శిఖిముఖీ వాళ్ళూ అతడి కేసి ఓ క్షణ కాలం చూసి ముందుకు కదలబోయేంతలో, జ్యోతిష్యుడు "శూరసేనదేశపు కేసరీ, ఆగు! ఒక్క మాట," అన్నాడు పెద్దగొంతుతో.

తనను ఆ విధంగా పేరుపెట్టి పిలిచిన జ్యోతిష్యుడి కేసి ఆశ్చర్యంగా చూస్తూ విక్రమకేసరి నిలబడ్డాడు. జ్యోతిష్యుడి చేత సాముద్రికం చెప్పించుకుంటున్న కొందరు విక్రమకేసరినీ, అతడి వెంటవున్న వాళ్ళనూ పరీక్షగా చూడసాగారు.

శిఖిముఖి జ్యోతిష్యుడి కేసి రెండడు గులు వేసి, "అయ్యా, చేయి చూసి మను షుల పేర్లు చెప్పే జ్యోతిష్యుల్ని కొందరిని నే నెరుగుదును. కాని, మీరు మనిషి ముఖం చూసి పేరూ వూరూ తెలుసుకో గలిగారు. లోగడ మా ప్రాంతాల ఏమన్నా వున్నారా?" అని అడిగాడు.





జ్యోతిష్యుడు వికవిక మంటూ నవ్వి, "నేను అఘోరీ జ్యోతిశ్శాస్త్ర పండితుణ్ణి, శిఖీ! భూతభవిష్యత్ వర్తమానాలు అన్నీ వున్నపాళంగా చెప్పగలను. మీరిక వచ్చిన దారినే ఇంటికి తిరిగిపొండి. వృద్ధ విక్రమ కేసరి బతికిలేడు. పైగా మీరు వెయ్యేళ్ళ వయసు గల మహాశక్తిమంతుడితో విరోధం తెచ్చుకున్నారు. సాహసించి బ్రహ్మపుత్రా నదీ లోయల్లోకి పోయారో మీరు బలవన్మరణం పొందుతారు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే విక్రమకేసరి కత్తి దూయబోయాడు. శిఖిముఖి అతణ్ణి వారించి చిన్నగొంతుతో, "కేసరీ! తొందర పడకు. మనం వున్నది దేశంకాని దేశం. ఈ కపట జ్యోతిష్యుడు శిథిలాలయ పూజారి మిత్రుడో సేవకుడో అయివుంటాడు. ఆ దుర్మార్గుడి ద్వారానే వీడు మనను గురించి విన్నాడు. అంటే దాని అర్థం, ఆ పూజారి యీ పట్టణంలోనే ఎక్కడో వున్నాడన్న మాట; మనను యిన్నాళ్ళుగా ఒక కంట కనిపెట్టే వున్నాడని తెలుస్తున్నది గదా!" అన్నాడు.

"అలాగే తోస్తున్నది. ఆ దుర్మార్గుడి పీడ విరగడైపోయిందనుకున్నాను. సరే, మనం యిక యీ జనంలో తిరగటం మంచిది కాదు. వాడి బంట్లు మనను చాటు నుంచి దెబ్బ తీయవచ్చు. మన విడిది సత్రంకు పోదాం పదండి," అన్నాడు విక్రమకేసరి.

నలుగురూ ఓ అర గంట తరవాత సత్రం దగ్గిరకు వచ్చేసరికి, సత్రం యజమాని వాళ్ళతో, "మీ గురువుగారు, మీరు విడిది చేసిన గదిలో వున్నారు. ఓ గంట కాలంగా మీ కోసం ఎదురు చూస్తున్నారు," అని చెప్పాడు.

సత్రం యజమాని యిలా అనగానే నలుగురూ ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు. శిఖిముఖి సత్రం యజమాని కేసి అను

మానంగా చూస్తూ, "మాకు గురువంటూ ఎవరూ లేరు. వాడెవడో దొంగ అయి వుంటాడు. మేం దిగిన గది వాడికి చూపావా?" అని అడిగాడు.

సత్రం యజమాని కళవెళపడిపోతూ, "గది చూపాను. అతడు గొప్ప కాళీ భక్తుడిలా వున్నాడు. ఏదో గుడికి పూజారి ననీ, మీకు చాలా కాలంగా గురువుననీ చెప్పాడు," అన్నాడు.

"సరే, వాడి సంగతి మేం చూసు కుంటాం. మా గది వైపు నుంచి కేకలూ అరుపులూ వినిపించినా, ఓ అర గంట వరకూ అటు కేసి ఎవర్నీ రానీయకు," అంటూ శిఖిముఖి గబగబా మిద్దెపై నున్న తమ గది కేసి బయలుదేరాడు. విక్రమ కేసరీ, క్షత్రియయువకు లిద్దరూ అతడి వెనకనే నడిచారు.

విక్రమకేసరీ వాళ్ళు విడిదికని తీసు కున్న గది తలుపులు బార్లా తెరిచి వున్నవి. అందరికన్న ముందు నడుస్తున్న శిఖిముఖి గదిలో అడుగు పెడుతూనే శిథిలాలయ పూజారిని చూశాడు. పూజారి ఒక చిన్న కొయ్యపెట్టెను బద్దలు కొట్టేందుకు ఒక చురకత్తి పిడితో దాని మీద బలంగా కొడుతున్నాడు.




శిఖిముఖి వాకిట్లోకి రాగానే పూజారి తల ఎత్తి అతడి కేసి చూసి, వికృతంగా నవ్వుతూ, "శిఖీ, మంచి సమయానికే వచ్చావే! సరే, నువ్వూ నీ స్నేహితులూ గడప దగ్గిరే ఆగండి. ఈ తుక్కు పెట్టెను తెరిచేందుకు నా మంత్రశక్తిని వృథా చెయ్యటం ఎందుకని, యీ చురకత్తిని వాడుతున్నాను," అన్నాడు.

శిఖిముఖి గడప దగ్గిరే ఆగి, వెనక నిల బడివున్న క్షత్రియ యువకులైన అజితు డికీ, వీరభద్రుడికీ కనుసైగతో ద్వారాన్ని కాపలాకాయమని హెచ్చరించి, ముందుకు రెండడుగులు వేసి, "పూజారీ! ఆ పెట్టెలో



శిథిలాలయానికి పోయేందుకు అవసరం అయిన దారి గుర్తులు గల తాళపత్రం వున్నదనుకుంటున్నావా? ఉహుం, అది అక్కడ లేదు. ఇదుగో, కేసరి దాన్ని సర్వదా తన దుస్తుల్లో దాచుకు తిరుగుతున్నాడు. కొంచెం దగ్గిరకొచ్చి అడుగు, యిచ్చేస్తాడు," అన్నాడు.

విక్రమకేసరి తన దుస్తుల్లో నుంచి ఒక పెద్ద తాళపత్రం తీసి పూజారి కేసి రెపరెపలాడించాడు. పూజారి దాన్ని చూస్తూనే పళ్ళుకొరికి, "దాని కోసం అడగాలా? అడుగుతున్నాను; నోటితో కాదు కత్తితో!" అంటూ తన చేతులోవున్న చురకత్తిని విక్రమకేసరి కేసి విసిరాడు.

రానున్న ప్రమాదాన్ని ముందుగానే గుర్తించిన శిఖిముఖి, విక్రమకేసరిని భుజాలు పట్టుకుని కిందికి లాగాడు. చురకత్తి రివ్వుమంటూపోయి ద్వారబంధానికి బలంగా గుచ్చుకుపోయింది. శిఖిముఖి, పూజారిని పట్టుకునేందుకు ముందుకు దూకేంతలో అతడు గది వెనకవున్న తలుపు తెరుచుకుని పక్కనేవున్న పిట్టగోడ మీంచి కిందికి దూకేశాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ పిట్టగోడను ఒక్క తృటికాలం ఆలస్యంగా చేరారు. పూజారి అంత ఎత్తు నుంచి కిందపడి మరణిస్తాడని వాళ్ళనుకున్నారు. కాని, మిద్దె కింది ఆవరణలో నిలబడివున్న సవర భేరుండం, పూజారి నేల తాకకుండా మధ్యలోనే పట్టుకుని, అతణ్ణి దాపులనున్న రెండు గుర్రాల్లో ఒకదాని మీద ఎక్కించి, తాను రెండో గుర్రం మీదికి లంఘించాడు.

శిఖిముఖి చప్పున వెనక్కు తిరిగి, "అజితా! వీరభద్రా! మీరు సత్రం ఆవరణలోకి పరిగెత్తి, గుర్రాల మీద పారిపో చూస్తున్న ఆ దుర్మార్గుల్ని పట్టుకోండి!" అని కేకపెట్టాడు. అజితుడూ, వీరభద్రుడూ కిందికి పరిగెత్తారు. —(ఇంకా వుంది)





# రహస్యం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఇలా శ్రమపడటానికి కారణం రహస్యమైనదిగా కనబడుతుంది. కాని కొన్ని రహస్యాలు మహా దారుణమైనవి. ఆ సంగతి నిరూపించే ఒక విచిత్రమైన కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం అవంతీపురాన్ని పరిపాలించిన చంద్రసేనుడూ, ఆయన భార్య ప్రభావతీ మిక్కిలి పుణ్యాత్ములు. వారికి సకలైశ్వర్యాలూ ఉండి కూడా సంతానం లేకపోవటం తీరని లోటుగా ఉండేది. వారిని చూడటానికి ఎందరో తపస్సంపన్నులు వచ్చిపోతూండేవారు. రాజు తన చింతను వారితో

బేతాళ కథలు



చెబుతూండేవాడు, కాని ఎవరూ వారికి సహాయం చెయ్యలేదు.

ఇలా ఉండగా వారి వద్దకు ఒక ముని వచ్చాడు. భార్యా భర్త లిద్దరూ ఆయనకు అతిథిసత్కారాలు చేశారు. వారిని చూసి ముని తనంతట తానే, "మీ రిద్దరూ సంతానం కోసం తహతహలాడుతున్నారు. రాజుకు తన అనంతరం సింహాసనం మీద కూర్చునే కొడుకు కావాలి. రాణీకి అచ్చట్లూ, ముచ్చట్లూ తీర్చే కూతురు కావాలి. కాని ఇద్దరి కోరికా నెరవేరదు. నే నొక పండు ఇస్తాను. రాణి శుచిగా కాళికాలయానికి వెళ్ళి, సరిగా అర్ధరాత్రివేళ తనకు కొడుకే



కావాలో, కూతురే కావాలో నిర్ణయించుకుని, ఆ పండు తిన్నట్టయితే ఆమె కోరిన విధంగా సంతానాన్ని కంటుంది," అని, రాణి చేతిలో ఒక పండు పెట్టాడు.

రాచనగరులోనే కాళికాలయం ఉన్నది. ఆ రాత్రి రాణి స్నానం చేసి, అర్ధ రాత్రికి ముందే కాళికాదేవికి ఎదురుగా కూర్చుని, తన కెలాటి సంతానం కావాలో నిర్ణయించుకొన యత్నించింది. తనకు కూతురే కావాలో, కొడుకే కావాలో ఆమె దృఢంగా నిర్ణయించుకో లేకపోయింది. ఇంతలో దేవిడీలో అర్ధరాత్రి నగారా మోగింది. రాణి పండు తినేసింది.

కాలక్రమాన రాణి గర్భాన ఒక కొడుకు పుట్టాడు. రాణి చాలా సంతోషించింది. ఎందుకంటే కొడుకు కలగటం భార్యాభర్త లిద్దరికీ ఇష్టమే. అంతే గాక రాజ్యానికి వారసుడు కూడా ఏర్పడ్డాడు.

అయితే ఆ కొడుకు పుట్టిన రాత్రే రాణి ఆనందం ఆందోళనగా మారింది. ఎందుచేతనంటే రాత్రి అయేసరికల్లా మగబిడ్డ కాస్తా ఆడపిల్లగా మారిపోయింది. మళ్ళీ మర్నాడు తెల్లవారే సరికల్లా పురిటిపక్కలో మగబిడ్డ తయారయాడు. తాను కన్న బిడ్డ పగలు మగబిడ్డా, రాత్రి ఆడబిడ్డా అవుతూం



డటం రాణి గమనించింది. తాను ఏ బిడ్డ కావాలో స్థిరంగా తేల్చుకోని కారణంచేతనే ఇలాంటి ఫలితం కలిగిందని రాణి గ్రహించి, తనకు పుట్టిన బిడ్డ రహస్యం తనకూ, తన పరిచారికకూ తప్ప మరెవ్వరికీ తెలియకుండా దాచి ఉంచింది.

రాజు తనకు కొడుకు కలిగాడనే అనుకున్నాడు. ఆ కుర్రవాడికి విజయుడని నామకరణం చేసి, సమస్త విద్యలూ నేర్పించాడు. పగలు విజయుడు గానూ, రాత్రి విజయ గానూ ఉంటూ రాజుకొడుకు యుక్తవయస్కుడయాడు. అతని జన్మరహస్యం బయట పడనేలేదు.

ఇలా ఉండగా ఒకనాడు కొందరు చెంచులు వచ్చి, "మహాప్రభూ, మే ముండే అరణ్యాలలోకి పెద్దపులి ఒకటి వచ్చింది. కావాలంటే తమరు వచ్చి వేటాడవచ్చు," అని చెప్పారు.

"మన యువరాజును మీ వెంట పంపిస్తాను. వాడు విలువిద్యలోనూ, ఖడ్గవిద్యలోనూ ఎంతో నిపుణుడై ఉండి కూడా ఇంతవరకూ అరణ్యానికి వేటకు పోలేదు," అన్నాడు రాజు.

విజయుడు తన అస్త్రాలన్నీ తీసుకుని రథ మెక్కి చెంచుల వెంట బయలుదేరాడు. రోజల్లా అందరూ కలిసి వేటాడారు.





విజయుడు సాయంకాలంవేళ పులిని కొట్టాడు. అతడు చెంచులను అరణ్యంలో వదిలేసి, తన వెంట వచ్చిన కొద్ది భటులతో ఇంటిముఖం పట్టాడు. సూర్యాస్తమయం కాబోతున్న సమయంలో తలవనితలంపుగా ఒక మదపుటేనుగు రాజకుమారుడి రథానికి ఎదురుగా పరిగెత్తుకుంటూ వచ్చింది. విజయుడి పరివారం చెదిరి పారిపోయారు. ఏనుగు విజయుణ్ణి తన తొండంతో పట్టి ఎత్తి అరణ్యానికి అడ్డం పడి పరిగెత్తసాగింది. దాని తొండంలో చిక్కిన విజయుడు ఏమి చెయ్యటానికీ అసహాయుడై పోయి, కేకలు పెట్టసాగాడు.

ఆ కేకలను రత్నగిరి రాజకుమారుడు వసంతుడు విన్నాడు. అతను కొద్ది రోజుల క్రితం వేటకు వచ్చి, అరణ్యం మధ్య ఒక చిన్న కొండపైన గుడారం వేసుకుని ఉంటున్నాడు. నిద్రపోతున్న వసంతుడికి ఎవరో కేకలు పెట్టటం వినిపించింది. కంఠం స్త్రీ కంఠంలాగున్నది. ఆ కంఠం కూడా తనకు సమీపంగా వస్తున్నట్టు తోచింది. ఎవరో అనాథ స్త్రీని దొంగలు పట్టుకొస్తున్నారనుకుని, వసంతుడు కత్తి పట్టుకుని గుడారం బయటికి వచ్చాడు. కొండ కిందుగా ఏనుగు పరిగెత్తు కొస్తూండటమూ, దాని తొండంలో మనిషి ఉండటమూ కనిపించింది.

వసంతుడు లేడి లాగా కొండ కిందికి దూకుతూ వెళ్ళి, తన కత్తితో మదపుటేనుగు తొండాన్ని ఒక్క వేటున నరికాడు. తొండం కింద పడింది. ఏనుగు అరణ్యంలోకి పారిపోయింది. కింద పడిన విజయను లేవదీసి, భుజాన వేసుకుని వసంతుడు తన గుడారానికి తెచ్చాడు.

"అహా! ఎంత అందంగా ఉన్నావు! ఎవరు నువు? ఈ అరణ్యం మధ్య ఏనుగు వాత ఎలా పడ్డావు? నీ వస్త్రాభరణాలు చూస్తే ఏ రాజభవనంలోనో ఉండవలసిన దానివే!" అన్నాడు వసంతుడు.

"నేను అవంతీపుర రాజకుమార్తెను. నా పేరు విజయ. నేను సపరివారంగా మా నగరుకు పోతూ మదపుటేనుగు బారి పడ్డాను. దాని నుంచి కాపాడిన మీ రుణం ఎలా తీర్చుకోను?" అన్నది విజయ.

"నేను రత్నగిరి రాజు కొడుకును. నా పేరు వసంతుడు. నన్ను పెళ్ళాడి నట్టయితే నీ రుణం తీరిపోతుంది," అన్నాడు వసంతుడు.

"అలాగే పెళ్ళాడతాను. మీరు ఇంటికి వెళ్ళి, మన పెళ్ళికి మీ తండ్రిని ఒప్పించి, మంచి ముహూర్తం చూసి మా దేశానికి బయలుదేరి రండి. ఈ దగ్గిరలో ఏదన్నా కోనేరున్నదా? వెంటనే స్నానం చెయ్యాలి," అన్నది విజయ.

"ఆ మలుపులోనే చక్కని కోనేరున్నది. స్నానం చేసిరా. నే నిక్కడే ఉంటాను," అన్నాడు వసంతుడు.

విజయ వెళ్ళిపోయింది. ఆమె అందాన్ని మాటి మాటికీ తలుచుకుంటూ, ఆమె తనను పెళ్ళాడటానికి ఒప్పుకున్నందుకు మురిసిపోతూ వసంతుడు ఆమె కోసం చాలా సేపు చూస్తూ ఉండిపోయాడు. తూర్పున అరుణోదయం అయినా కూడా ఆమె తిరిగి రాలేదు.



వసంతుడు ఆందోళన పడి కోనేటి వేపు వెళ్ళి, దాని ఒడ్డున స్నానం చేసి ఒళ్ళు తుడుచుకుంటున్న విజయుణ్ణి చూశాడు.

"ఎవరు నువ్వు? ఇక్కడికి స్నానం చెయ్యవచ్చిన రాజకుమార్తె ఏమయింది?" అని అతను విజయుణ్ణి అడిగాడు.

"నువు మాట్లాడేది మా చెల్లెలు విజయ గురించి అయి వుండాలి. ఆమె ఇంతకు ముందే మా పరివారంతో వెళ్ళిపోయింది. నే నామె అన్నను. ఇద్దరమూ కవల పిల్లలం," అన్నాడు విజయుడు.

విజయుడు వసంతుడితో కాస్సేపు మాట్లాడి, తన దుస్తులు ధరించి వసంతుడి



దగ్గిర సెలవు పుచ్చుకుని కొండ దిగి వచ్చే శాడు. అతను కొద్ది దూరం నడిచేసరికల్లా అతని పరివారం అతని కెదురు వచ్చారు. మరి కనిపించడనుకున్న రాజకుమారుడు తిరిగి కనిపించేసరికి వారి ఆనందానికి మేరలేదు.

వాళ్ళు తిరిగి వచ్చే సమయంలో విజ యుడికి ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. విజయుడు తన రథాన్ని అటు కేసి పరి గెత్తించి, అరణ్యంలో ఒక యువతిని బలాత్కరించే ఒక పురుషుణ్ణి చూసి, ముందూ వెనకా చూడకుండా, ఒక్క వేటుతో ఆ పురుషుడి తల నరికేశాడు.



భయకంపితురాలైవున్న ఆ యువతి విజ యుడి చేతుల్లో మూర్ఛపోయింది.

ఇంతలోనే కొందరు భటులు పరిగెత్తు కుంటూ వచ్చి, "మా రాజకుమార్తె కేం జరిగింది? మా సేనాపతిని చంపినదెవరు?" అని అడిగారు.

తన చేతులలో మూర్ఛపోయిన యువతి, రత్నగిరి రాజకుమార్తె అనీ, ఆమె తన అన్న అయిన వసంతుణ్ణి కలుసుకుని వేటలో కొంతకాలం గడపటానికి తమ సేనా పతి వెంట బయలుదేరిందనీ, దారిలో ఆమెకు దాహమైతే తామంతా నీరు కోసం వెతుకుతూ నాలుగు వైపులా వెళ్ళామనీ భటులు చెప్పారు.

"మీ సేనాపతి ఈమెను బలాత్కరించ బోతూండగా నేను వచ్చి కాపాడాను," అని విజయుడు చెప్పాడు.

భటులు తెచ్చిన నీటితో వసంతుడి చెల్లెలు లవంగికి స్పృహ వచ్చింది. ఆమె కళ్ళుతెరిచి విజయుణ్ణి చూసి, "మీ రెవరు? ఆ దుర్మార్గుడేమయాడు?" అని అడిగింది.

"వాడు చచ్చాడు. నువు భయపడనవ సరం లేదు," అంటూ విజయుడు లవంగిని తన రొమ్ము మీది నుంచి లేవదీసి మెల్లిగా కూర్చోబెట్టాడు.



లవంగి సేనాపతి శవం కేసి చూసి, "మీరు వచ్చి కాపాడకపోతే నా గతి ఏమై ఉండును! మీ రుణం ఎలా తీర్చుకో గలను?" అన్నది.

"నేను అవంతీపుర రాజకుమారుణ్ణి. నా పేరు విజయుడు. నన్ను పెళ్ళాడావంటే నీ రుణం తీరిపోతుంది," అన్నాడు విజయుడు.

లవంగి సిగ్గుతో తలవంచుకుని, "తప్పక పెళ్ళాడతాను. అది నాకు వరం అను కుంటాను," అన్నది.

"అలా అయితే నువు మీ ఇంటికి వెళ్ళి, మీ నాన్నగారి అనుమతిపొంది, మన పెళ్లికి ముహూర్తం పెట్టించి మా దేశానికి బయలు దేరి రా!" అని విజయుడు ఆమె వద్ద సెలవు పుచ్చుకుని అవంతీపురానికి తిరిగి వచ్చాడు.

అతను ఇంటికి తిరిగి వచ్చి తన తల్లి దండ్రులతో జరిగిన సంగతులేవీ చెప్పలేదు.

ఒక నెల గడిచాక రత్నగిరిరాజు అవంతీ రాజుకు లగ్నపత్రిక పంపాడు. అందులో రత్నపురి రాజుకూతురు తన కొడుకునూ, ఆమె అన్న తన కుమార్తెనూ పెళ్ళాడేటట్టూ, వారంతా మర్నాడే తరలి అవంతీపురానికి వస్తున్నట్టూ ఉన్నది.

రాజు కంగారుపడి తన భార్యతో, "రత్న గిరి రాజు కూతుర్ని మన విజయుడికి చేసు





మనవాడు ఎవరిని చేసుకోవటానికీ పనికి రాడే!" అని రాజు వాపోయాడు.

ఇదంతా తన అవివేకం వల్లనే జరిగిందని విజయుడు గ్రహించాడు. తన తండ్రి పరువు నిలబడాలంటే తాను బలికావటం తప్ప మార్గాంతరం లేదు. అందుచేత అతను కాళికాలయానికి వెళ్ళి, "మాతా, నన్ను మా తల్లిదండ్రుల కిచ్చి వారికి దుఃఖమే తెచ్చిపెట్టావు. నా జన్మ అన్ని విధాలా నిరర్థకమే అయింది. నన్ను నువే పుచ్చుకో!" అని కత్తితో తన తల నరుక్కొని పడిపోయాడు.

కోవటమంటే సంతోషంగానే ఉన్నది గాని, వారి కుమారుడి కివ్వటానికి మనకు కుమార్తె లేదు గదా, ఇలాటి పొరపాటు ఎలా జరిగి ఉంటుంది?" అన్నాడు.

పొరపాటుకు కారణం ఎలా ఏర్పడి ఉంటుందో రాణి ఊహించినా, జరిగిన దేమిటో విజయుణ్ణి అడిగి తెలుసుకున్న దాకా ఆమెకూ తెలియదు. ఇంత కాలంగా దాచిన రహస్యం ఇప్పుడామె రాజుకు చెప్పేసింది.

"ఎంత తలవంపులు! ఈ అవమానం నుంచి బయట పడే మార్గ మేమిటి? పగలు మగవాడూ, రాత్రి ఆడదీ అయే

అదే సమయంలో రత్నగిరి రాజు కొడుకూ, కూతురూ అవంతీపురం చేరు కున్నారు. వాళ్ళకు విజయుణ్ణి గురించి నిజం తెలిసిపోయింది. పగలు పురుషుడుగా మారే స్త్రీని ప్రేమించినందుకు వసంతుడు చాలా జుగుప్స చెందాడు.

లవంగి మాత్రం జుగుప్స చెందలేదు. "రోజుకు ఒక్క గడియసేపు అతని భార్యగా ఉన్నా నా జన్మ ధన్యమే," అంటూ ఆమె విజయుడి జాడ అడిగింది. అతను కాళికాలయానికి వెళ్ళినట్టు తెలిసి, ఆమె కూడా అక్కడికే వెళ్ళి, విజయుడి శవాన్ని చూసింది.

"కాళికాదేవీ, నేను వరించినవాణ్ణి బలి పుచ్చుకున్నావా? మమ్మల్నిద్దర్నీ నువే ఏకం చెయ్యి," అంటూ విజయుడి కత్తి తీసుకుని లవంగి తన తల నరుక్కోబోయింది.

అప్పు డామె చెయ్యి ఎవరో గట్టిగా పట్టుకున్నట్టయింది.

అశరీరవాణి ఇలా పలికింది: "మూర్ఖురాలా, తొందరపడకు. ఈ శవాన్ని పురుషుడుగా బతికించమన్నావా? స్త్రీగా బతికించమన్నావా? చెప్పు!"

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, లవంగి ఏమని కోరటం భావ్యంగా ఉంటుంది? ఆమె బతికించవలసినది విజయనా? విజయుణ్ణా? తాను విజయుడుగా ప్రేమించక ముందే ఆ వ్యక్తిని తన అన్న విజయగా ప్రేమించాడు. అన్న కోసం లవంగి త్యాగం చెయ్యవద్దా? లేక ఆమె స్వార్థంగా విజయుణ్ణే బతికించుకోవాలా? ఈ అనుమానానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి రాజు, "ఇది అర్థం లేని అనుమానం. విజయతో ఇప్పు డెవరికీ పని లేదు. రాణీ ప్రభావతి పుత్రికా సౌఖ్యాన్ని పూర్తిగా అనుభవించి, ఆమెను కాపరానికి పంపటానికి సిద్ధంగా ఉన్నది. వసంతుడు విజయను ప్రేమించినందుకు అదివరకే జుగుప్స చెందాడు. కొడుకును కన్నందుకు చంద్రసేన మహారాజు కోరిక, ఆ కొడుకును తన అనంతరం సింహాసనం మీద కూర్చో బెడితే గాని తీరబోదు. విజయుడి కోసం లవంగి ఆత్మార్పణ చేసుకునేటందుకు సిద్ధంగా ఉంది. కాళికాదేవి వరమిస్తున్నది లవంగికి, వసంతుడికి కాదు. కనక బతకవలసినది విజయుడే గాని, విజయ కాదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# హరహర బైరాగి

ఒక బైరాగి ఉండేవాడు. అతనికి ఒక ఊరంటూ లేదు. అస్తమానమూ తీర్థ యాత్రలు చేస్తూ, దేశాటన చేసేవాడు. డబ్బు తీసుకునేవాడు కాడు, ఎవరన్నా దయతలిచి తిండి పెడితే తినేవాడు, లేక పోతే లేదు.

ఒకరోజు జోరున వాన కురుస్తూ ఉండగా బైరాగి, వానలో తడిసి ముద్ద అయిపోయి, ఒక గ్రామం చేరుకుని, ఆ గ్రామంలో ఉండే ఒక ధనికుడి ఇంటి వసారా అరుగు మీద కూర్చున్నాడు.

ఇంటి యజమాని లోపలి నుంచి కిటికీ గుండా బైరాగిని చూసి, "ఛీ, ఛీ! కుళ్ళు గుడ్డలూ, నువ్వూనూ. అరుగంతా పాడు చేస్తివే. పో, పో!" అని కసిరాడు.

"హరహరా," అంటూ ఆ బైరాగి, ఆ అరుగు మీది నుంచి దిగి, వానలో తడుస్తూ వెళ్ళి, కొద్ది దూరంలో ఉన్న ఒక పూరి ఇంటి చూరు కింద, గోడ నానుకుని నిలబడి, "హరహరా!" అనుకున్నాడు.

ఆది విని ఆ పేద ఇంటివాడు లాంతరు తీసుకుని బయటికి వచ్చి, బైరాగిని చూసి, "వానగా ఉన్నది. లోపలికి రండి," అని పిలిచాడు.

బైరాగి లోపలికి వెళ్ళాడు. ఇంటివాడి భార్య బైరాగికి పొడిగా ఉన్న రెండు చింకి గుడ్డ లిచ్చి, "ఒళ్లంతా తుడుచుకుని, ఆ తడిబట్టలు విప్పి, పొడిబట్టలు కట్టుకోండి," అన్నది. బైరాగి అలాగే చేశాడు.

తరవాత ఇంటివాళ్ళు రొట్టె ముక్క, ఇంత పచ్చడీ, కాసిని గంజినీళ్ళూ ఇచ్చి, "పేదవాళ్ళం. వీటితోనే ఆకలి తీర్చు కోండి," అన్నారు.

"హరహరా!" అని బైరాగి వాళ్ళిచ్చిన ఆహారం పుచ్చుకుని, వాళ్ళు చూపిన చింకి చాప మీద పడుకుని నిద్రపోయాడు.

వి. ప్రసాదరావు



మర్నాడు బైరాగి లేచి, తన బట్టలు తాను తీసుకుని, ఇంటివాళ్ళిచ్చిన బట్టలు విడిచేసి ప్రయాణమయాడు. అప్పుడు ఇంటివాడు ఒక చిన్నడబ్బా తెచ్చి, దాన్ని బోర్లించి, అందులో ఉన్న చిల్లర డబ్బులు బైరాగి చేత పెట్టి, "దారి ఖర్చుకు అవసరం రావచ్చు, ఉంచండి," అన్నాడు.

బైరాగి, "హరహరా!" అని తన చేతిలోని డబ్బులు చూసుకుని, "నేను డబ్బులు తీసుకోను, నాయనా," అంటూ వాటిని తిరిగి డబ్బాలో పోసేసి, "హరహరా!" అనుకుంటూ వెళ్ళిపోయాడు.

బైరాగి చిల్లర డబ్బులు తిరిగి డబ్బాలో పోసినప్పుడు, అవి బరువుగా పడినట్టూ, డబ్బా పూర్వం కన్న చాలా బరువుగా వున్నట్టూ ఇంటివాడికి అనుమానం కలిగింది. వాడు తిరిగి డబ్బాలోని డబ్బులు తన చేతిలోకి బోర్లించుకుంటే, అన్నీ బంగారు నాణాలే!

"ఎవడో గొప్ప సిద్ధుడు లాగున్నాడు!" అన్నాడతను.

"ఈ కొత్తబట్టలు చూశారా?" అన్నది భార్య ఆశ్చర్యంగా. నిన్న రాత్రి బైరాగికి కట్టుకోవటానికి ఇచ్చిన చింకిగుడ్డలు జరీగల కొత్త బట్టలయాయి. బైరాగి రాత్రి పడు




కున్న చింకిచాప మేలురకం తివాసీగా మారిపోయింది.

అది మొదలు ఆ పేదవాడికి అదృష్టం అడుగడుగునా కలిసివచ్చింది. పాత ఇల్లు పోయింది, కొత్త ఇల్లు కట్టుకున్నాడు.

తన పొరుగున ఉన్న పేదవాడికి సిరి ఎత్తుకోవటం ధనికుడు గమనిస్తూనే ఉన్నాడు. ఆయన విచారించగా, ఆ పేదవాడు తాను, వెళ్ళగొట్టిన బైరాగికి చేసిన సేవల ఫలితంగానే అతను స్థితిమంతుడైనాడని తెలియవచ్చింది.

"ఆ బైరాగి సిద్ధుడని నాకు మాట మాత్రం తెలియక పోయెనే! ఎటువంటి



అవకాశం చెయ్యి జారనిచ్చానూ?" అనుకుని ఆ ధనికుడు ఆ బైరాగి మళ్ళీ కనిపిస్తాడేమోనని వెయ్యి కళ్ళతో కనిపెడుతూ వచ్చాడు.

ఒక ఏడాది గడిచింది. మళ్ళీ వానలు పడుతున్నాయి. వానలో తడుస్తూ ఆ బైరాగే ధనికుడి ఇంటి కేసి చూసి, పాతఅనుభవం గుర్తుకు రావటంతో, పేదవాడి ఇంటి కేసి నడవసాగాడు.

ఈ లోపల ధనికుడు బైరాగిని చూసి, పరిగెత్తుకుంటూ వచ్చి, "రండి, రండి, బైరాగిగారూ! ఈ వానలో పడి ఎక్కడికి పోతారు? మా ఇల్లు పావనం చెయ్యండి," అంటూ బైరాగిని లోపలికి ఆహ్వానించి, తన ఇంట్లో ఉన్న ఒక ఇరుకు గదిలోకి తీసుకుపోయి, తుడుచుకోవటానికీ, కట్టుకోవటానికీ పాడి గుడ్డలు చింకివి ఇచ్చి, రొట్టెముక్కా, పచ్చడీ, గంజీ బైరాగి ముందు పెట్టి, "ఆరగించండి," అన్నాడు.

బైరాగి ఆకలి తీరినాక ధనికుడు ఒక చింకిచాప పరిచి, బైరాగిని పడుకోమన్నాడు.

తెల్లవారగానే బైరాగి లేచి, ధనికుడిచ్చిన గుడ్డలు విడిచి, తన గుడ్డలు కట్టుకుని, వెళ్ళటానికి సిద్ధమయాడు. అప్పుడు ధనికుడు దోసెడు చిల్లర డబ్బులు, రాగివి తెచ్చి, "దారి ఖర్చులకు ఉంచండి," అంటూ బైరాగి చేతిలో పోశాడు.

"నేను డబ్బు తీసుకోను, నాయనా!" అంటూ బైరాగి వాటిని ధనికుడికే ఇచ్చి వెళ్ళిపోయాడు.

ధనికుడు ఆత్రంగా తన డబ్బులు చూసుకున్నాడు. అవి రాగి డబ్బులుగానే ఉన్నాయి. బైరాగి వదిలిన బట్టలూ, పడుకున్న చాపా కూడా ఏమీ మారలేదు.

మారిందేమిటంటే ధనికుడి అదృష్టం. అతనికి అడుగడుగునా నష్టం వచ్చి, క్రమంగా అతని సంపదంతా తరిగిపోయింది.






# యశస్కరుడి న్యాయనిర్ణయం

కాశ్మీరు దేశం చాలా కాలం దుష్ట రాజుల పరిపాలనలో నలిగిపోయిన మీదట అక్కడి బ్రాహ్మణులు, దారినపోయే పేద బ్రాహ్మణ్ణి పట్టుకొచ్చి రాజ్యాభిషేకం చేశారు. క్రీస్తు శకం 939 లో ఈ విధంగా రాజైన యశస్కరుడు పరిపాలన చక్కగా చేశాడు.

ఇతని పరిపాలనలో ఎవరన్నా నిరశన ప్రారంభిస్తే రాజుకు నివేదించటానికి ప్రత్యేకంగా అధికారు లుండేవారు. ఒకసారి వాళ్ళు ఒక మనిషి నిరాహార దీక్ష పూని నట్టు నివేదించారు.

యశస్కరుడు ఆ మనిషిని పిలిపించి, అతని వృత్తాంతం అడిగాడు. ఆ మనిషి ఇలా చెప్పాడు:

"స్వామీ, ఒకప్పుడు నే నిక్కడ సంపన్నుడుగా బతికినవాణ్ణే. కాని రోజులు కలిసి రాక నేను క్రమంగా ఉన్నదంతా పోగొట్టుకుని అప్పులపాలు అయాను. అప్పులవాళ్ల బాధ పడలేక, నా ఇంటిని సైతం విక్రయించాను. నా ఇంటిని కొన్న వాడొక ధనిక వర్తకుడు. అయితే, నా భార్యకు కూడా ఏదన్నా బతుకు తెరువు చూపే ఉద్దేశంతో దిగుడుబావి మాత్రం అమ్మ లేదు. పూల తోటలవాళ్ళూ, తమలపాకు తోటలవాళ్ళూ ఆ బావిని ఉపయోగించుకుని డబ్బిస్తే, ఆ డబ్బుతో నా భార్య తన పొట్ట పోసుకుంటుందిగదా అనుకున్నాను. నేను దేశాంతరాలకు వెళ్ళి, ఇరవై ఏళ్ళపాటు కొంత డబ్బు పోగు చేసి తిరిగి వచ్చి చూతును గదా, నా భార్య ఇతరుల ఇళ్ళలో కూలి చేసుకుంటూ కృశించి కనబడింది. నువు ఇంత హీనస్థితి కెలా దిగజారావు అని నేను అడిగితే, మా ఇల్లు కొన్న వర్తకుడు తనను బావి దగ్గిరికి రానివ్వకుండా కర్రలతో కొట్టించాడనీ, తాను చాకిరీ చేసుకు బతుకుతున్నాననీ చెప్పింది. నాకు

పట్టరాని దుఃఖమూ, ఆగ్రహమూ వచ్చింది. ఎంతోమంది న్యాయాధికారులకు విజ్ఞప్తులు చేశాను. అందరూ నాకు విరుద్ధంగానే తీర్పు చెప్పారు. అందుచేత ఆమరణ నిరశనం అవలంబించాను. నాకు న్యాయశాస్త్రాలు తెలీవు. కాని నేనా బావి అమ్మని మాట మాత్రం నిజం."

రాజు మిగిలిన న్యాయాధికారుల నందరినీ పిలిపించాడు. వాళ్ళు రాజుతో, "మహారాజా, ఈ మనిషి మమ్మల్ని చాలా పీడించాడు. ఇతనికి న్యాయమంటే ఏమీ లక్ష్యం ఉన్నట్టు కనబడదు," అన్నారు.

రాజు క్రయపత్రం తెప్పించి చూశాడు; దిగుడుబావితో సహా ఇల్లు విక్రయమైనట్టు అందులో స్పష్టంగా ఉన్నది. కాని ఇల్లు అమ్మిన వాడికి అన్యాయం జరిగినట్టు రాజుకు గట్టి నమ్మకం కలిగింది.

రాజు అవతలికి వెళ్ళి, తన నౌకరు నొకణ్ణి పిలిచి, వాడికి తన ముద్రిక నిచ్చి, "నువు ఫలానా వర్తకుడి పెద్ద గుమాస్తా వద్దకు వెళ్ళి, ఇల్లు కొన్న ఏడు నాటి చిఠా పుస్తకం పట్టా. అది తిరిగి ఇచ్చేదాకా ఈ ముద్రిక ఉంచుకోమను," అని పంపాడు.

ఆ నౌకరు చిఠా పుస్తకం తెచ్చి రాజు కిచ్చాడు. అందులో, క్రయపత్రం రాసిన వాడికి వెయ్యి దీనారా లిచ్చినట్టు ఖర్చు పద్దు కనిపించింది. రాజు ఈ పద్దు సభికులందరికీ చూపించి, పత్రం రాసిన వాణ్ణి విచారించగా, తాను ఒక్క అక్షరం మార్చాననీ, కూపరహితంగా, అనటానికి కూపసహితంగా అని రాశాననీ ఒప్పు కున్నాడు.

సభికులంతా నిర్ణయించిన ప్రకారం రాజు ఇల్లు అమ్మిన వాడికి ఆ ఇల్లు తిరిగి ఇప్పించి, వర్తకుడికి దేశబహిష్కార శిక్ష విధించాడు.

—(తరువాయి పై సంచికలో)





# రాజుగారి వైరాగ్యం

ఒక రాజుగారి ఆస్థానంలో ఒక పండితుడు రోజూ పురాణం చదువుతూండేవాడు. పురాణం వినగా వినగా రాజుగారికి ఐహిక బంధాల నుండి విముక్తిపొంది, మనశ్శాంతి చేకూర్చుకోవాలన్న కోరిక కలిగింది. తనకు కావలిసిన బంధవిముక్తి కలిగించగల వాడు ఆ పండితుడే అనుకుని రాజుగారు ఒకనాడు ఆయనతో, "పండితోత్తమా, ప్రాపంచిక విషయాల నుండి విముక్తి పొందే మార్గం ఏమిటో నాకు చెప్పు," అన్నాడు.

దానికా పండితుడు, "మహాప్రభూ, నేను పొట్టతిప్పలు కోసం పురాణం చదివి, అందులో ఉండే విషయాలు చెప్పుకునే వాణ్ణే గాని, ఆధ్యాత్మిక విషయాలు బోధించగల తత్వవేత్తను కాను. ప్రాపంచిక బంధాలు నాకే వదలలేదు; తమకు వదిలే మార్గం నేనెలా చెప్పగలను?" అన్నాడు వినయంగా.

ఆ మాటకు రాజు మండిపడి, కళ్ళెర్ర జేసి, "ఇదుగో, బ్రాహ్మడా! నేను తరించటం ఇష్టంలేక దొంగవేషాలు వేస్తున్నావు. నువ్వు రేపు గాని నాకు ఐహిక బంధ విముక్తి మార్గం చెప్పక పోయావో, నిన్ను ఉద్యోగంలో నుంచి తీసెయ్యటమే గాక, నీ తల కూడా తీయించేస్తాను. ఆలోచించుకో," అన్నాడు.

పురాణ పండితుడికి గుండెలో రాయి పడింది. గుడ్ల నీళ్ళు కుక్కుకుంటూ ఆయన ఇంటికి వెళ్ళాడు.

ఈ పండితుడికి మంచి తెలివి తేటలు గల కూతురొకతె ఉన్నది. ఆమె తన తండ్రి దైన్యం గమనించి, దానికి కారణం అడిగింది.

తండ్రి ఆమెకు ఆస్థానంలో జరిగినదంతా సవిస్తరంగా చెప్పాడు.

అంతా విని ఆమె, "ఈ మాత్రానికే దిగులు పడతా వెందుకు, నాన్నా? రేపు

మాంకాల ప్రభాకర్‌రావు

పురాణం చదవటానికి రాజుగారింటికి వెళ్ళే టప్పుడు నన్ను కూడా వెంట తీసుకుపో. రాజుగారికి తగిన సమాధానం నేను చెబుతాను," అన్నది.

మర్నాడు రాజసభకు పండితుడి వెంట కూతురు కూడా బయలు దేరింది. ఆమె తనతోబాటు మూరెడు తాడు కూడా పట్టుకుపోయింది.

రాజు సభ తీరి కూర్చున్నాడు. పండితుడు పురాణం ప్రారంభించాడు. ఆయన కూతురు ఒక స్తంభం దగ్గిర చేరి, తన కాళ్లను స్తంభం చుట్టూ వేసి, తాను తెచ్చిన తాడుతో వాటిని బంధించి, గట్టిగా అరుస్తూ, ఏడవ సాగింది. పురాణం భంగమయింది. ఏమి టేమిటని సభికులు ఆ పిల్ల నడిగారు.

"నన్ను వదిలించండి! నన్ను వదిలించండి!" అని ఆమె అరిచింది.

ఆమె కాళ్ళకు కట్టిన తాడు చూసి ఎవరో విప్పారు. కాని ఆమె ఆ స్తంభాన్ని కాళ్ళా, చేతులా పెనవేసి, "నన్ను వదిలించండి! నన్ను వదిలించండి!" అని ఇంకా అరుస్తూనే ఉన్నది.

రాజు అది చూసి, కోపంతో తన ఆసనం నుంచి దిగి వచ్చి, "ఓసీ, బుద్ధిహీనురాలా! నువే స్తంభాన్ని గట్టిగా కరుచుకుని, ఎవరినో వదిలించ మంటావేమిటి? నీకు మతి ఏమైనా పోయిందా ఏం?" అన్నాడు.

పండితుడి కూతురు విరగబడి నవ్వుతూ, "మనిద్దరమూ మతిలేని వాళ్ళమే. నువు నీ రాజ్యాన్నీ, అధికారాన్నీ, సంపదనూ అంటి పెట్టుకుని, మా నాన్నను విడిపించమని అడగటం లేదా? నీకు నిజంగా ప్రపంచంతో సంబంధం వదులుకోవాలని ఉంటే అడ్డేవారెవరన్నా ఉన్నారా?" అని అడిగింది.

రాజు సిగ్గుతో తలవంచుకుని, పండితుడికీ, ఆయన కూతురికీ కూడా క్షమాపణ చెప్పుకున్నాడు.





# ఆడతేడాలు

ఒక గ్రామంలో ఒక పేదరాలుండేది. ఆమెకు కొండడూ, గుహుడూ అని ఇద్దరు కొడుకులు. వారిని పోషించే మార్గంలేక ఆమె గ్రామాల వెంట తిరుగుతూ, ఒక గ్రామంలో అకస్మాత్తుగా పెద్ద జబ్బు చేసి చనిపోయింది.

గ్రామస్థులు ఆమె శవాన్ని దహనం చేసి, అనాథలైపోయిన ఆమె కొడుకుల గతి ఏమిటని ఆలోచించారు.

ఆ గ్రామంలోని రైతు లందరిలోకీ భాగ్యవంతుడికి ఇద్దరు కూతుళ్ళున్నారుగాని కొడుకులు లేరు. ఆయన కొండణ్ణీ, గుహుణ్ణీ చేరదీసి సంరక్షించటానికి ఒప్పుకున్నాడు. రైతుకు కొన్ని ఆవులూ, గొర్రెలూ ఉండేవి. వాటిని మేపటం వాళ్ళ పని. కొండడు ఆవులను మేపేవాడు, గుహుడు గొర్రెలను కాసేవాడు. ఇద్దరూ పశువులను తోలుకుని ఒక లోయకే వెళ్ళేవారు.

అన్నదమ్ములకు వయసులో పెద్ద తేడా లేకపోయినా, బుద్ధులలో చాలా తేడా ఉండేది. కొండడు ఈడుకు మించి ఉండేవాడు. ధైర్యమూ, చొరవా గలవాడు. గుహుడు బక్కపలచగా ఉండేవాడు. వాడు సాత్వికుడూ, పిరికివాడూనూ.

యజమాని కొండడికి ఒక చరణాకోల ఇచ్చాడు. కొండడు అస్తమానమూ దాన్ని చేతబట్టి, చెళ్ళు చెళ్ళుమని మోగిస్తూ ఉండేవాడు. గుహుడు తనంతట తానే వెదురు గొట్టంతో ఒక వేణువు తయారు చేసుకున్నాడు. వాడు దాని మీద ఎలాంటి పాటలనైనా అవలీలగా వాయించేవాడు. ఆ వేణువు కూడా అస్తమానమూ వాడి చేతిలోనే ఉండేది.

రైతు కూతుళ్ళిద్దరిలో కూడా చాలా తేడా ఉండేది. పెద్దది దుర్గ చాలా కఠిన స్వభావురాలు. తల్లి పోవటంచేత ఇంటి

సి. వాసుదేవరావు



ఏ చెట్టుబోదె నానుకునో కూర్చుని వేణువు మీద పాటలు వాయిస్తూ ఉంటే అలివేణి పరమానందంతో వినేది.

ఒకనాడు సూర్యాస్తమయం వేళ అన్న దమ్ము లిద్దరూ లోయ నుంచి ఇంటికి తిరిగి పోబోతూ తమ తమ పశువులను లెక్క పెట్టుకుంటే ఒక గొర్రె తక్కువయింది. ఇద్దరూ కలిసి లెక్క పెట్టినా ఒక గొర్రె తక్కువగానే కనిపించింది.

గుహుడు ఏడుపు మొహం పెట్టి, "ఏం చేద్దాం అంటావ్? యజమాని నన్ను చావ గొడతాడు," అన్నాడు.

పెత్తనమంతా ఆమెదే. ఆమె కొండడికీ, గుహుడికీ ఏ పూటా కడుపు నిండా తిండి అయినా పెట్టేది కాదు. కొండడి చేతిలో ఉండే చరణాకోల అంటే ఆమెకు భయం, అందుచేత వాడి జోలికి అంతగా వెళ్ళేది కాదు గాని, గుహుణ్ణి అవకాశం దొరికినప్పు డల్లా నానా మాటలూ అనేది.

రైతు రెండో కూతురు అలివేణి చాలా సాధువు. ఆమె తన అక్కను చూసి భయ పడేది; కొండణ్ణీ, గుహుణ్ణీ చూసి జాలి పడేది. ఎవరూ చూడకుండా ఆమె ఆ అన్న దమ్ములకు తినటానికేమన్నా తెచ్చి పెడుతూ ఉండేది. సాయంత్రం పూట గుహుడు,

"ఇంకా ఇంటికి పోయేవేళ కాలేదు. ఏ తోడేలో ఈడ్చుకుపోయి ఉంటుంది, లేక పోతే గొర్రె ఎందుకు మాయమవుతుంది? తోడేలు జాడ వెంబడి పోదాం పద!" అన్నాడు కొండడు.

త్వరలోనే వాళ్ళకు తోడేలు జాడ కన బడింది. దాని వెంట వాళ్ళు అరణ్యం లోకి వెళ్ళారు.

"తోడేలు గుహ దాకా వెళ్ళి దాన్ని చంపి తెచ్చామంటే యజమాని ఏమీ అనడు. తోడేలుచర్మం గొర్రె విలువ చెయ్యక పోదు," అన్నాడు కొండడు, తమ్ముడికి ధైర్యం చెబుతూ.

కాని గుహుడికి ధైర్యం చాలలేదు; "చీకటి పడుతున్నది. ఇంటికి పోదాం," అన్నాడు వాడు.

కొండడు చరణాకోల చెళ్ళుమనిపించి, "తోడేలు సంగతి తేలకుండా వెనక్కు రాను," అన్నాడు.

అకస్మాత్తుగా వాళ్ళు ఒక ఇంటి ముందుకు వచ్చి చేరారు. తోడేలు జాడలు అక్కడ ఆగిపోయాయి.

"ఇక్కడే మునీశ్వరుడైనా ఉండి మనని ఈ రాత్రికి పడుకోనిస్తాడేమో!" అంటూ కొండడు తలుపు తట్టాడు. తలుపు దగ్గిరిగా వేసి ఉండటంచేత తెరుచుకున్నది. లోపల ఎవరూ లేరు. కాని పొయ్యి మండుతున్నది. గొర్రెచర్మం ఒక మూల పారేసి ఉన్నది. దాని మాంసం పొయ్యి మీద వున్న ఒక పెద్ద పాత్రలో ఉడుకుతున్నది.

"అది మన గొర్రే, గుహుడూ! ఆ తోడేలు నా కంట పడనీ చెబుతాను," అన్నాడు కొండడు.

"ఈ ఇంట్లో తోడే లెందు కుంటుంది?" అన్నాడు గుహుడు.

"మరి మనం వచ్చింది తోడేలు జాడ బట్టేనే?" అన్నాడు కొండడు అయోమయంగా.



"నాకు భయంగా ఉంది, అన్నా. మనం వెళ్ళిపోదాం," అన్నాడు గుహుడు.

"నా చరణాకోల ఉండగా నాకెవరి భయమూ లేదు. ఇంత దూరం వచ్చాం గదా? గొర్రె ఖరీదైనా పుచ్చుకుని మరీ పోదాం," అన్నాడు కొండడు.

"ఈ ఇంట్లో ఎవరుంటారో ఏమో? వాళ్ళు మన కంట పడినదాకా మనం దాక్కోవటం మంచిది కాదూ?" అన్నాడు గుహుడు.

ఇది కొండడికి కూడా సరిగానే కనిపించింది. వాళ్ళిద్దరూ నిచ్చెన మీదుగా అటక ఎక్కి దాక్కున్నారు.



తరవాత కొద్ది సేపటికే తలుపు తోసుకుని ఒక తోడేలు లోపలికి వచ్చింది. అది తన శరీరమంతా ఒక్కసారి విదిలించుకుని ఒక అందమైన యువతిగా మారిపోయింది.

ఇదంతా అటక కంతలలోనుంచి చూస్తున్న అన్నదమ్ములు భయంతో బిగుసుకు పోయారు. ఆడమనిషి తోడేలు కాగలదంటే ఎవతో మాయలమారి మంత్రగత్తె అయి ఉండాలనుకున్నారు వాళ్లు.

ఆ యువతి పొయ్యి కింది కట్టెలు ఎగ దోసి, మంట పెద్దది చేసి, మూల నుంచి దీపంబుడ్డి తీసి వెలిగించింది. తరవాత ఆమె పొయి మీది మాంసం దింపి, గబగబా తినెయ్యసాగింది. చక్కగా వేగిన మాంసం వాసనకు అన్నదమ్ములకు నోరూరింది. వాళ్ళను కూడా ఆకలి దహించేస్తున్నది.

అకస్మాత్తుగా ఆమె తల ఎత్తి అటక కేసి చూసి, "మీ రిద్దరూ ఇక దిగిరండి," అని కేక వేసింది.

ఇద్దరికీ భయంతో ప్రాణాలు కడబట్టాయి.

"భయపడకండి. నా భోజనం అయి పోయింది. మిగిలినది మీరు తినండి," అన్నదామె.

ఆమె మాటలు వాళ్ళు ఏ మాత్రమూ నమ్మలేదు, కాని ఆమె చెప్పినట్టు చెయ్యక తప్పేది లేదు. అందుచేత కొండడు ముందూ, వెనకగా గుహుడూ నిచ్చెన దిగి కిందికి వచ్చారు.

"నీ చేతిలో ఆ చరణాకోల కూడా దేనికి? అవతల పెట్టు," అన్నదామె కొండడితో. కొండడు దాన్ని మరింత గట్టిగా పట్టుకున్నాడు. ఆమె తన చేతిని కొద్దిగా ఊపింది. కొండడి చరణాకోల వాడి చేతిలో నుంచి ఎగిరివెళ్లి ఒకమూల పడింది. ఆమె నవ్వుతూ, "నేను చెప్పినట్టు చెయ్యటం మంచిది. ఇక తినండి," అన్నది.

"ఇది మా గొర్రే!" అన్నాడు కొండడు, ధైర్యం పూర్తిగా వదలకుండా.



"నిజమే. మీ గొర్రెను కాజేసిన అడ తోడేలును నేనే. మీరు నా జాడ కనుక్కొని ఇక్కడిదాకా రావటమే నాకు బాగాలేదు. నా రహస్యం మీ యిద్దరికీ తెలిస్తే తెలిసింది, మరెవ్వరికీ చెప్పకండి. చెప్పేట్టయితే నేను మిమ్మల్ని ఇక్కడి నుంచి కదల నివ్వను," అన్నదామె.

వాళ్ళు మాట్లాడలేదు.

"మీ రిద్దరూ బుద్ధిమంతుల్లాగే ఉన్నారు. ఎవరితోనూ ఏమీ చెప్పకుండా వుంటే మీకు మంచి బహుమానా లిస్తాను, తెలిసిందా? మీ ఇద్దరికీ అన్నిటికన్న ఏది ఎక్కువ ఇష్టమో చెప్పండి," అన్నది తోడేలు యువతి.

"మాకు మాదంటూ ఏమీ లేదు. నాకున్నవాటిల్లో కెల్లా నా చరణాకోలంటేనే ఎక్కువ ఇష్టం," అన్నాడు కొండడు.

"అలా అయితే నీ చరణాకోలకు గొప్ప శక్తి నిస్తాను. నీ కెవరన్నా అయిష్ట మైన పని చేయబోతుంటే నీ చరణాకోల చెళ్ళుమనిపించి, 'ఆగు!' అన్నావంటే ఆ మనిషి మరి కదలటం ఉండదు—నువ్వు 'కదులు' అన్నదాకా!....నీ కిష్టమైన దేమిటి?" అని ఆమె గుహుణ్ణి అడిగింది.

"నా వేణువు," అన్నాడు గుహుడు రహస్యంగా.



"అలా అయితే ఇకనుంచి నువు వేణువు ఊదావంటే ఎవరైనాసరే నీ యిష్ట ప్రకారం చెయ్యవలసిందే! ఒకటి జ్ఞాపకం ఉంచు కోండి. మీకు ఈ శక్తులున్నాయి గదా అని వాటిని అనవసరంగా ఉపయోగించవద్దు; వాటిమూలంగా మంచివాళ్ళకు కీడు కలి గించవద్దు. అలా చేస్తే ఆ శక్తులు పోతాయి. ఇంకో సంగతి కూడా జ్ఞాపకం ఉంచుకోండి. మీరీ రాత్రికి ఇక్కడే ఉండి, సూర్యో దయం లోపల వెళ్ళిపొండి. ఈ ఇంట్లోకి సూర్యకిరణాలు పడగానే నేను తోడేలు నయిపోతాను. తోడేలుగా ఉండగా మీరు నా కంట పడ్డారో నేను మిమ్మల్ని చీల్చుకు





తంటాను. అప్పుడు నా స్వభావం తోడేలు స్వభావంగానే ఉంటుంది," అని ఆమె వాళ్ళను హెచ్చరించింది.

వాళ్ళు ఆ రాత్రి ఆ ఇంట్లోనే పడుకుని, తూర్పు తెల్లవారుతూండగానే లేచి తమ గ్రామానికి వెళ్ళిపోయారు.

వాళ్ళను చూస్తూనే వాళ్ళ యజమాని పట్టరాని ఆగ్రహంతో, గోడ నుంచి పలుపు తాడు తీసుకుని, "తప్పుడు వెధవల్లారా, ఏమైపోయారు? మీ రక్తం కళ్ల జూస్తాను," అంటూ వాళ్ళకు ఎదురు వచ్చాడు.

తండ్రి రంకెలు విన్న దుర్గ పరమానందంతో పరిగెత్తుకుంటూ వచ్చింది, తండ్రి వాళ్ళను చావగొట్టుతుంటే చూసి ఆనందించాలని. అలివేణి మాత్రం వణికిపోతూ గదిలోకి పోయి తలుపేసుకున్నది.

యజమాని తమను కొట్టటానికి పలుపు తాడు ఎత్తగానే కొండడు చరణాకోల మోగించి, "ఆగు!" అన్నాడు. వెంటనే రైతు శిలాప్రతిమ లాగా అయిపోయాడు. ఎత్తిన చెయ్యి ఎత్తినట్టే ఉన్నది, కాళ్ళు భూమికి అంటుకుపోయి కదలలేదు.

"ఏమిటిది? ఏమయింది నాకు?" అన్నాడాయన. ఆయన నోరు మాత్రం పడిపోలేదు.

"మమ్మల్ని కొట్టనని మాట యివ్వండి, మీరు కదిలేటట్టు చేస్తాను," అన్నాడు కొండడు మంచిగా.

"ఇదేం గారడీ? నే నేమీ మాట యివ్వను. నీ చర్మం వొలుస్తాను. నీ ప్రాణాలు తోడుతాను," అన్నాడు రైతు.

"అయితే నీ ప్రాణం పోయినదాకా అలాగే ఉండి పో. నా దేం పోయింది?" అంటూ కొండడు వెనక్కు తిరిగి వెళ్లి పోబోయాడు, గుహుడి చెయ్యి పట్టుకుని.

రైతు ఆందోళనగా వాణ్ణి వెనక్కు పిలిచి, "పోకు, పోకు! నిన్నేమీ చెయ్యను. ప్రమాణం!" అన్నాడు.

"మమ్మల్ని అన్యాయంగా ఎప్పుడు కొట్టినా ఇదేగతి!" అంటూ కొండడు చరణా కోల మోగించి, "కదులు!" అన్నాడు. అప్పుడు రైతుకు మళ్ళీ చెయ్యీ కాలూ ఆడింది. వెంటనే అతను కొండడి మీద పడి, వాడి చేతిలో ఉన్న చరణాకోల ఊడ లాగబోయాడు.

అప్పుడు గుహుడు తన వేణువు తీసి వాయించసాగాడు. ఆ పాట వింటుంటే రైతు మనసులో ఏదో ఆవేదనా, అన్న దమ్ముల మీద అమితమైన జాలీ పుట్టు కొచ్చాయి. కళ్ళ వెంబడి ఒకే ధారగా నీళ్లు కారాయి.

ఇదంతా చూస్తున్న దుర్గ, "ఉన్నట్టుండి అలా అయిపోతున్నా వేమిటి, నాన్నా? నీ కేమయింది?" అని అడిగింది.

"పాపం, పసికుంకలు! వాళ్ళను కొట్టట మేమిటి? ఆకలేస్తూ వుండాలి. రండి, బాబులూ. వచ్చి చక్కగా అన్నం తినండి," అన్నాడు రైతు.

ఇద్దరూ లోపలకు వెళ్లి కడుపు నిండా తిన్నారు. ఎన్నడూ వాళ్ళకు సరిగా తిండి పెట్టని రైతు ఇవాళ వాళ్ళను బలవంతం చేసి తినిపించాడు. కాని వాళ్ళు తిండి తిని వెళ్ళిపోయాక రైతుకు అతని అసలు స్వభావం క్రమంగా తిరిగి రాసాగింది.





"ఇవాళ నేను ఇలా మారిపోయా నేమిటే?" అని ఆయన తన పెద్ద కూతుర్ని అడిగాడు.

"ఏమీ లేదు. ఆ కొండడి చరణా కోలకూ, గుహుడి వేణువుకూ ఎవరో మంత్ర శక్తులు కలిగించారు. ఆ రెంటినీ వాళ్ల దగ్గిర నుంచి లాగుకోకపోతే, మనని ఎలా కావా లంటే అలా ఆడించెయ్యగలరు వాళ్ళు. మనకు చివరకు ఇల్లూ, వాకిలీ కూడా మిగ లదు, చూస్తూండు," అన్నది దుర్గ.

ఆ చరణాకోలా, వేణువూ వాళ్ళ వద్ద నుంచి మాయోపాయం వల్ల కాజెయ్యాలనీ, కొండణ్ణి తాను మోసగించి చరణాకోల కాజేసి, వేణువును గుహుడి దగ్గిర కాజెయ్యా టానికి అలివేణిని ఉపయోగిస్తాననీ దుర్గ తండ్రితో చెప్పింది.

ఆమె అలివేణిని పిలిచి ఈ మాట చెబితే, అలివేణి దిగ్భ్రమ చెందింది. కాని అక్క కెదురు చెప్పే సాహసంలేక ఆమె అన్నిటికీ తల ఊపింది.

మర్నాడు దుర్గ ఒక బుట్ట నిండా మంచి ఆహారం పెట్టుకుని లోయకు వెళ్ళి, కొండడి పక్కనే కూర్చుని, "చూడు, కొండా. మన ఊళ్ళో ఇంతమంది కుర్రాళ్ళున్నారు గాని నీ మీద ఉన్నంత ఇష్టం నా కెవరి మీదా లేదు," అంటూ తాను తెచ్చిన ఆహారం తాను తింటూ వాడికి కూడా పెట్టింది.

కొండడు ఆమె పెట్టినదంతా ఆత్రంగా తిన్నాడేగాని, ఆమె మాటకు జవాబేమీ చెప్పలేదు. ఆమె తనను వంచిస్తున్నదని వాడికి తెలుసు.

"నా మాట నమ్మవా? నువ్వూ, నాన్నా అభ్యంతరం చెప్పకపోతే నిన్ను పెళ్ళాడాలని ఉంది," అన్నది దుర్గ, చరణాకోల ఉన్న కొండడి చెయ్యి పట్టుకుని. కొండడు చరణా కోలని రెండో చేతికి మార్చుకున్నాడు.

"నేను ఎంత మూఢుణ్ణని నువ్వను కుంటున్నావు?" అన్నాడు వాడు.



"ఛీ, ఛీ! ఏం మాటలవి, కొండా?.... ఏదీ? ఆ చరణాకోల ఒకసారి ఇయ్యవూ? నీలాగే చెళ్ళుమనిపించి చూస్తాను," అన్నది దుర్గ, ముద్దులు కుడుస్తూ. ఆమె అతని మీదిగా వంగి చరణాకోల లాగేసుకుని, విజయగర్వంతో "హా! హా!" అని అట్టహాసం చేస్తూ, లేచి నిలబడి, చెయ్యి ఆడించి చరణాకోలను మోగించ యత్నించింది. కాని అది మోగలేదు.

కొండడు ఆమె చేతినుంచి దాన్ని లాగేసి, "ఇక పద! నాకా తిండి ఎందుకు తెచ్చావో తెలుసు. ఇంకెన్నడూ ఇక్కడికి రాకు. నేను నీతో మాట్లాడను. వెళ్ళిపో!" అన్నాడు కోపంగా.

దుర్గ కొండడున్న చోటికి వచ్చినట్టే అలివేణి కూడా గుహుడున్న చోటికి భోజనం తెచ్చింది. ఆమె అక్కడికి రావటం ఇది మొదటిసారి కాదు. ఇద్దరూ పక్క పక్కనే కూర్చుని ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పుకున్నాక, అలివేణి, "గుహా, నేనంటే నీకు కాస్త ఇష్టమేనా?" అన్నది.

"మా అన్న తరవాత నాకు నువ్వంటే ఉన్నంత ఇష్టం ప్రపంచంలో ఇంకెవరన్నా లేదు. ఈ సంగతి నీకు తెలీదా?" అన్నాడు గుహుడు.




"నేనడిగితే నీ వేణువు నా కిస్తావా?" అన్నది అలివేణి.

"కావాలంటే తీసుకో," అంటూ గుహుడు తన వేణువును ఆమె కిచ్చాడు.

అలివేణి ఏడవ సాగింది. గుహు డెంత అడిగినా కారణం చెప్పలేదు. చివరకామె వేణువును తిరిగి ఇచ్చేస్తూ. "నా కక్కర్లేదు, గుహా. నువ్వేమంటావో అని అడిగాను, అంతే. దానికి గొప్ప మంత్రశక్తి ఉన్నదని నాకు బాగా తెలుసు. అది నీకు చాలా అవసరం," అన్నది.

"మంత్రశక్తి మాట నీ కెలా తెలుసు?" అని గుహుడు అడిగాడు.



"నాన్నా, అక్కా అన్నారు," అన్నది అలివేణి.

"ఆ మాట నిజమే," అంటూ గుహుడు జరిగినదంతా ఆమెకు చెప్పాడు.

అంతా విని అలివేణి, "అయితే నీకీ గొర్రెలను కాసే కర్మేమిటి, గుహా? నీ వేణువుతో మా నాన్న చేత ఏమైనా చేయించుకో వచ్చునే. నన్ను నీ కిచ్చి పెళ్ళి చెయ్యమని అడుగు. ఆలశ్యం ఎందుకు? బయలుదేరు," అన్నది.

"నీ కభ్యంతరం లేకపోతే ఎందుకడగనూ?" అంటూ గుహుడు ఆమె వెంట రైతు ఇంటికి బయలుదేరాడు.

వాళ్ళు ఇంటికి చేరే ముందరనే దుర్గ ఇల్లు చేరి, తండ్రితో, "అంతా ధ్వంసం చేసేశాను, నాన్నా. అలివేణి ఏం చేసిందో చూడాలి?" అన్నది.

ఇంతలోనే అలివేణీ, గుహుడూ చెట్టపట్టాలు పట్టుకుని వచ్చారు.

"నేనింక మీ గొర్రెలు కాయను. నన్ను అలివేణి కిచ్చి పెళ్ళి చెయ్యండి. మా కిద్దరికీ చాలా ఇష్టం," అన్నాడు గుహుడు.

రైతు ఉగ్రుడైపోయాడు. అంతలోనే గుహుడు వేణువు పైకి తీసి వాయించాడు. రైతు హృదయం వెన్నలాగా కరిగిపోయింది. అతను గుహుడి చెయ్యి పట్టుకుని, "తప్పకుండా పెళ్ళాడండి! ఇద్దరూ సుఖంగా ఉండండి," అన్నాడు.

"అదేమిటి, నాన్నా?" అని దుర్గ అరుస్తూండగా కొండడు కూడా వచ్చాడు.

"నేనిక మీ పశువుల్ని కాయనండీ. నేనూ నా తమ్ముడూ ఇంకెక్కడికన్నా వెళ్ళి, బతుకుతెరువు చూసుకుంటాం," అన్నాడు వాడు యజమానితో.

"ఎలా వెళతావురా, బాబూ? నీ తమ్ముడికి అలివేణి నిచ్చి పెళ్ళి చెయ్యటానికి ఒప్పుకున్నాను," అన్నాడు యజమాని.

"సరే, అలాగైతే నేను ఒక్కణ్ణే వెళ్ళిపోతాను," అన్నాడు కొండడు.

దుర్గ వెర్రిగా అరుస్తూ, "మీ ఇద్దరూ పొండి. అలివేణీ, నువ్వీ వెధవను పెళ్ళాడాలనుకుంటే నువు కూడా పో," అన్నది.

"అవును, పెళ్ళాడతాను," అన్నది అలివేణి.

"ఆడతోడేలు నైనా కూడా నేను పెళ్ళాడను," అన్నది దుర్గ.

ఆమె ఆ మాట అంటూండగానే బయటి నుంచి తోడేలు అరుపు వినపడింది. మరు క్షణం ఒక పెద్ద ఆడతోడేలు లోపలికి దూకింది.

"నేనూ ఆడతోడేలునే! కొండడు సరే నంటే నేను పెళ్ళాడతాను," అన్నదా తోడేలు మనిషి భాషలో. కొండడా తోడేలును గుర్తించాడు.

"పెళ్ళాడటం, నా కిష్టమే," అన్నాడు వాడు ధైర్యంగా.

"అలా అయితే నన్ను ముద్దుపెట్టుకో, కొండా," అంటూ తోడేలు తన ముందు కాళ్ళెత్తి కొండడి భుజాల మీద పెట్టింది.

కొండడు సాహసించి తోడేలును ముద్దు పెట్టుకున్నాడు. వెంటనే ఆమెకు తోడేలు రూపం పోయి మనిషి రూపం వచ్చింది.

"నా శాపం తొలగించావు, కొండా. ఒక మంత్రగాడు నా మీద అలిగి నన్నిలా చేశాడు. రాత్రిపూట మనిషిగానూ, పగలు తోడేలుగానూ బతికాను. నేనూ ఒకప్పుడు ఈ పిల్లలాటిదాన్నే, క్రూరమైన మనిషిని. ఈ శాపం మరెవరికన్నా సంపకం చేసేదాకా నాకు విముక్తి లేదు," అని ఆ స్త్రీ దుర్గ కేసి చూసి, "ఇకనుంచీ తోడేలుగా ఉండటం నీ వంతు. నీ బుద్ధిమారి నిన్నెవరన్నా ముద్దు పెట్టుకునే దాకా నీ కీ శాపం పోదు," అన్నది.

చూస్తూండగానే దుర్గ తోడేలుగా మారి పోయి బయటికి పారిపోయింది.



# పద్ధతుల్లో తేడా

ఒకసారి అర్కాటునవాబు కంపెనీ అధికారి అయిన దొరతో మాట్లాడటానికి మద్రాసు వచ్చాడు. నవాబు మాట్లాడుతున్నంతసేపూ దొర దృష్టి నవాబు చేతికున్న రవ్వటుంగరం మీదనే ఉన్నది.

ఇది గమనించి నవాబు ఆ ఉంగరాన్ని తీసి దొర కిచ్చి, "పెట్టుకుని చూస్తారా?" అన్నాడు. దొర దాన్ని తన వేలికి పెట్టుకున్నాడు.

మాట్లాడటం పూర్తి అయాక నవాబు లేచి సెలవు పుచ్చుకుంటూ, "మరి నా ఉంగరం నా కిచ్చేస్తారా?" అన్నాడు.

"ఒకసారి చేతికి వచ్చిన వస్తువు తిరిగి ఇవ్వటం తెల్లవాళ్ళ పద్ధతి కాదు. కావలిస్తే దాని వెల చెప్పండి, ఇస్తాను," అన్నాడు దొర. ఏమీ అనకుండానే నవాబు వెళ్ళిపోయాడు.

కొన్ని వారాల అనంతరం నవాబు పెద్ద విందు చేస్తూ, కంపెనీ దొరనూ, అతని భార్యనూ ఆహ్వానించాడు. దొర భార్యను నవాబు భార్య అయిన బేగం జనానాలోకి తీసుకు పోయింది. విందు ముగిసినాక దొర బయలుదేరబోతూ, "ఇక మేం బయలుదేరుతాం. నా భార్యను పిలిపించండి," అన్నాడు.

"మా జనానా లోకి వచ్చిన స్త్రీని తిరిగి బయటికి వెళ్ళనివ్వక పోవటం మా పద్ధతి. కావలిస్తే బహుమానం ఇస్తాం," అన్నాడు నవాబు.

దొర సిగ్గుపడి తన చేతిన ఉన్న ఉంగరాన్ని తీసి నవాబు కిచ్చాడు. అతని భార్య నవ్వుకుంటూ జనానాలో నుంచి బయటికి వచ్చింది.






# తప్పుడుసాక్ష్యం

ఒక పట్టణంలో ఒక ధనవంతుడైన వర్తకుడుండేవాడు. అతను రవ్వలూ, కెంపులూ మొదలైన రత్నాలతో వ్యాపారం చేసి ధనం బాగా సంపాదించాడు. అతను సంపాదించిన ధనంలో న్యాయంగా సంపాదించినది తక్కువా, తెలియని వారిని మోసగించి సంపాదించినది ఎక్కువానూ.

ఈ వర్తకుడుండే ఇల్లు తాత ముత్తాతల నాటిది. ధనికు డుండదగినంత విశాలమైనది కాదు. ఇతని ఇంటి పొరుగునే ఒక కాపువాడి స్థలం ఉన్నది. దాన్ని కొనటానికి వర్తకుడు చాలా ప్రయత్నించాడు. కాపువాడుండేది కూడా తాత ముత్తాతల నాటిదే. దాన్ని వదలటం అతడికి అంత ఇష్టంలేదు. ధనికుడు తన స్థలానికి మంచి ధర ఇస్తే ఆ డబ్బుతో మరెక్కడన్నా స్థలం కొని, ఇల్లు కట్టుకుని కొంత డబ్బు మిగుల్చుకుందామనుకున్నాడు. కాని వర్తకుడు కాపువాడి స్థలానికి చాలా తక్కువ డబ్బు ఇస్తానన్నాడు. కాపు ఆగ్రహించి, "నీ డబ్బు ఎవడికి కావాలి. నేను నా స్థలం అమ్మేదిలేదు పో," అన్నాడు.

వర్తకుడికి కాపుమీద కోపం వచ్చి అతనితో మాట్లాడటం మానేసి, అతన్ని నానా రకాలా ఇబ్బంది పెట్టుతూ, తిట్టుతూ రాసాగాడు. అంతటితోనూ వర్తకుడికి కసి తీరలేదు. కాపును ఎలాగైనా సాధించాలని పించింది.

అతను ఒక రోజు తనకు తెలిసిన మల్లిరెడ్డి అనేవాణ్ణి పిలిచి, "మా పొరుగునున్న కాపువాడు నన్ను చాలా బాధిస్తున్నాడు. వీడి పని పట్టించాలి. పొరుగునే ఉన్నాడు గనక నా దగ్గిర మాణిక్యం ఒకటి దొంగిలించాడని ఫిర్యాదు తెస్తాను. నువు సాక్ష్యం పలుకుతావా? సాక్ష్యం లేనిదే న్యాయాధికారి ఫిర్యాదు వినడు," అన్నాడు.

ఎ. విజయలక్ష్మి

వర్తకుడు చెప్పినట్టు వింటే నాలుగు డబ్బులు చేతిలో పడతాయన్న ఆశతో మల్లిరెడ్డి అతడు చెప్పినట్టు తప్పుడు సాక్ష్యం పలకటానికి ఒప్పుకున్నాడు.

మర్నాడే వర్తకుడు రాజుగారి వద్దకు వెళ్ళి, తన పొరుగున ఉన్న కాపు తన ఇంట్లో జొరబడి మాణిక్యం ఒకటి కాజేశాడనీ, ఈ దొంగతనం జరుగుతూండగా మల్లిరెడ్డి అనే పెద్దమనిషి ఒకతను చూశాడనీ ఫిర్యాదు చేశాడు.

రాజుగారు అప్పటికప్పుడే మల్లిరెడ్డిని పిలిపించి, "ఈ వర్తకుడి మాణిక్యాన్ని కాపువాడు కాజేశాడట, నిజమేనా?" అని అడిగాడు.

మల్లిరెడ్డి, "చిత్తం మహాప్రభో! ఆ దొంగతనం జరుగుతూండగా నేను కళ్ళారా చూశాను," అన్నాడు.

"ఆ మాణిక్యం ఎలా ఉన్నది?" అని రాజు అడిగాడు.

మల్లిరెడ్డి తబ్బిబ్బుపడి, కొంచెం ఆలోచించి, చంకలో నుంచి ముల్లుకర్ర పైకి తీసి, "ఇలాగున్నదండి," అన్నాడు.

రాజు పకపకా నవ్వి, వర్తకుణ్ణి, "ఏమయ్యా, ఇంతింత పొడుగు మాణిక్యాలు కూడా అమ్ముతున్నావా ఏం?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే వర్తకుడు భయంతో వణికిపోయాడు.

మల్లిరెడ్డి రాజుతో, "మాణిక్యాలు ఇలాగే ఉంటాయి గదండీ? నా చిన్నతనంలో నేనొకసారి ముల్లుకర్ర పారేసుకుంటే, 'మాణిక్యమంటి ముల్లుకర్ర పారేశావుట్రా?' అని మా అయ్య చెడామడా తిట్టాడండి," అన్నాడు.

వర్తకుడి మోసం బయటపడింది. అమాయకుడి చేత అబద్ధపు సాక్ష్యం చెప్పించినందుకు రాజు వర్తకుడికి భారీగా జరిమానా వేశాడు.





# వర నిర్ణయం

పూర్వం ఒక అగ్రహారంలో ఒక ఉద్దండ పండితు డుండేవాడు. ఆయన తన పాండిత్యంతో రాజసభలలో ఎన్నో సన్మానాలు పొంది, గండపెండేరాలూ, శాలువలూ, ఈనాములూ సంపాదించుకున్నాడు.

ఈ పండితుడికి గౌరన్న అని ఒక కొడుకు వుండేవాడు. వాడు నిజంగానే పండిత పుత్రుడు—అంటే వట్టి శుంఠ అన్నమాట.

కొడుక్కు ఎలా పెళ్ళి చెయ్యటమా అన్న బెంగ పండితుణ్ణి బాధించసాగింది. ఆయన దూర గ్రామంలో మరొక పండిత కుటుంబం ఉంటే, వారి పిల్లను తన కొడుక్కు మాట్లాడమని మధ్యవర్తులను వేడుకున్నాడు. చెట్టు పేరు చెప్పి కాయ లమ్మిన విధంగా ఆ మధ్యవర్తులు, "ఫలానా మహా పండితుడి కొడుక్కు మీ పిల్లనిచ్చి చేస్తే మహా బాగా ఉంటుంది," అని పిల్ల వైపు వారితో అన్నారు.

పిల్లవైపు వాళ్ళు పరమానందం చెంది, పిల్లను చూసి పోవలసిందని తిరిగి కబురు చేశారు. గౌరన్న పిల్లను చూడబోయాడు. పిల్ల అన్నలు అతనికి తగని మర్యాద చేసి, తమ ఇంట ఉన్న పుస్తకాలన్నీ అతని ముందు పెట్టారు.

గౌరన్న ఒక్కొక్కటీ తీసి, "ఇదేమిటి? ఇదేమిటి?" అంటూ వచ్చాడు. వాళ్ళు చెప్పే సమాధానాన్ని బట్టి అది గొప్ప పుస్తకమని తోస్తే, "తరవాత చూడాలి," అనేవాడు. లేకపోతే, చప్పరించి అవతల పెట్టేవాడు. ఇలా చేస్తూ గౌరన్న ఒక పుస్తకం చూపి, "అదేమిటి?" అని అడిగాడు.

"అదా? అది అలిఖితం," అన్నారు పిల్ల అన్నలు.

అలిఖిత మంటే రాయని పుస్తకమని తెలీక గౌరన్న, "దాన్ని రాసినవారెవరు?" అని అడిగాడు.

పి. శ్యామలాదేవి

గౌరన్న శుంఠ అన్న సంగతి బయట పడింది. పిల్ల వైపు వాళ్ళు అతన్ని వచ్చిన దారినే సాగనంపారు.

* * *

ఒకరాజు కొక కుమార్తె ఉండేది. యుక్తవయసు రాగానే తల్లి దండ్రు లామెకు వివాహం చేద్దామనుకున్నారు.

"నేను వేసిన ప్రశ్నకు సమాధానం చెప్పినవాణ్ణి పెళ్ళాడతాను. అలా చాటింపు వెయ్యండి," అన్నది రాజకుమార్తె.

చాటింపు జరిగింది. అనేకమంది రాజ కుమారులు ఆమె ప్రశ్నకు సరి అయిన సమాధానం చెప్పి, ఆమెను పెళ్ళాడాలని వచ్చారు. ఆమె వారితో ఇలా చెప్పింది:

"నేను ఒక చిన్న లెక్క అడుగుతాను. నేను లెక్క చెప్పినాక, 'ఒకటి-రెండు మూడు,' అనే లోపుగా మీలో ఎవరు సరి అయిన సమాధానం చెబితే వారిని పెళ్ళాడ తాను. ఇక లెక్క వినండి. ఒక కొలనులో ఒక సిద్ధుడు ఒక తామరపువ్వు నాటాడు. అది మర్నాటికి రెండయింది. మూడోనాటికి నాలుగయింది. ఇలా తామర పూల సంఖ్య రోజూ రెట్టింపు అవుతూ పోయి, ముప్ఫయ్యవ రోజుకు కొలనంతా తామరపూలతో నిండి పోయింది. ఇప్పుడు నేనడిగే ప్రశ్న ఏమంటే, ఎన్ని రోజులకు కొలను తామరపూలతో సగం నిండింది?"

ఈ ప్రశ్న వేసి రాజకుమార్తె, "ఒకటి," అన్నది.

"పదిహేను రోజులకు!" అన్నారెవరో. మిగిలినవాళ్ళు ఆత్రంగా లెక్కలు కడు తున్నారు. ముప్ఫై రోజులకు ఎన్ని తామర పువ్వులవుతాయి, వాటిలో సగం ఎంత? ఇలా గుణిస్తున్నారు.

"రెండు," అన్నది రాజకుమార్తె.

"ఇరవై తొమ్మిది రోజులకు," అన్నాడొక రాజకుమారుడు. రాజకుమార్తె అతణ్ణి తన భర్తగా నిర్ణయించుకున్నది.






అప్పుడు సత్యవతి సిగ్గుపడుతూ తాను పడవ నడిపే రోజులలో పరాశరమహర్షికి కృష్ణద్వైపాయనుణ్ణి కన్న వృత్తాంతం చెప్పి, "అతను నా కొడుకు. గొప్ప తపస్సు చేసినవాడు. వేదాలను విభజించినవాడు. అతని ద్వారా భరతవంశాన్ని నిలబెట్టుదాం," అన్నది.

అందుకు భీష్ముడు సమ్మతించాడు. సత్యవతి తలుచుకోగానే కృష్ణద్వైపాయనుడనే వ్యాసుడు వచ్చి, "అమ్మా, నన్నెందుకు తలుచుకున్నావు?" అని అడిగాడు. సత్యవతి ఆయనకు తన ఉద్దేశం చెప్పింది. వ్యాసుడు సమ్మతించాడు.

తరవాత సత్యవతి అంబికను ఆ రాత్రి అలంకరించుకుని పడుకోమనీ, ఆమె వద్దకు ఆమె "బావ" వస్తాడనీ, అతనికి సంతానం కని వంశం నిలబెట్టమనీ చెప్పింది. "బావ" అంటే భీష్ముడే కాబోలునని అంబిక అనుకున్నది. కాని ఆ రాత్రి ఆమె గదిలోకి వ్యాసుడు వచ్చాడు. వ్యాసుడి గడ్డమూ, నల్లని ఆకారమూ, ఎర్రని కళ్ళూ చూసి అంబిక భయపడి కళ్ళు గట్టిగా మూసుకున్నది. ఆమె వ్యాసుణ్ణి అంతకు పూర్వం చూసి ఉండలేదు. ఆమె కళ్ళు మూసుకున్న దోషం చేత ఆమెకు పుట్టిన ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి అయాడు.

ఇది చూసి సత్యవతి హతాశురాలై మళ్ళా వ్యాసుణ్ణి తలచుకున్నది. ఈ సారి ఆమె అంబాలికతో, "ఈ రాత్రి నీ వద్దకు ఒక ముని వస్తాడు. అతని ద్వారా ఒక

## 5. దుర్యోధనాదుల జననం



ఉత్తముడైన కొడుకును కని వంశం నిలబెట్టు," అన్నది.

ఆ రాత్రి అంబాలిక వ్యాసుడి అవతారం చూసి, కళ్ళు మూసుకోలేదు గాని, వెలవెలపోయింది. దాని ఫలితంగా తెల్లని శరీరంతో పాండుడు పుట్టాడు.

సత్యవతికి తృప్తి కలగలేదు. ఆమె మరొకసారి అంబికను హెచ్చరిస్తూ, "ఈసారయినా మునికి తగిన కొడుకును కను," అన్నది. కాని వ్యాసుణ్ణి తలుచుకుంటే కంపరం పుట్టుకొచ్చి, ఆమె ఆ రాత్రి తన దాసీని తన పడక గదిలో ఉంచింది. ఆ దాసీ దానికి వ్యాసుడి వల్ల విదురుడు పుట్టాడు.



ఈ విధంగా పుట్టిన ధృతరాష్ట్రుడూ, పాండుడూ, విదురుడూ పెరిగి పెద్దవారవుతూంటే భీష్ముడు రాజ్యభారం వహించి, దేశం సుభిక్షంగానూ, ప్రజలు సుఖశాంతులు కలిగి ఉండేటట్టూ రాజ్యపాలన చేశాడు. భీష్ముడు వారికి క్షత్రియోచిత విద్యలూ, వేదవేదాంగాలూ, నీతిశాస్త్రాలూ, నేర్పించాడు.

వారిలో ధృతరాష్ట్రుడు అమిత బలశాలి, పాండుడు ధనుర్విద్యలో ప్రవీణుడు, విదురుడు ధర్మపరుడు.

కాలక్రమాన భీష్ముడు ఆ ముగ్గురిలోనూ ఒకరికి రాజ్యాభిషేకం చెయ్యవలసి వచ్చింది. ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి. విదురుడు దాసీ పుత్రుడు. అందుచేత వారిద్దరికీ కాక పాండుడికి భీష్ముడు రాజ్యాభిషేకం చేశాడు.

కురవాళ్ళకు వివాహయోగ్యమైన వయసు వచ్చింది. వాళ్ళకు తగిన కన్యలు ఎక్కడ ఉన్నారా అని భీష్ముడు ఆలోచించాడు. గాంధార రాజైన సుబలుడికి గాంధారి అనే కూతురున్నది. ఆమె తనకు నూరుగురు కొడుకులు కలిగేటట్టుగా శివుడి వల్ల వరం పొందినట్టు తెలిసింది. భీష్ముడు కొందరు బ్రాహ్మణులను సుబలుడి దగ్గిరికి







పంపి, గాంధారిని ధృతరాష్ట్రుడి కిచ్చి వివాహం చెయ్యమని అడిగించాడు. ధృతరాష్ట్రుడు గుడ్డివాడని తెలిసి కూడా అతని వంశం గొప్ప దనుకుని సుబలుడు ఒప్పుకున్నాడు. తనకు కానున్న భర్త గుడ్డివాడని తెలియగానే గాంధారి తన కళ్ళకు గంతలు కట్టేసుకుని, తాను కూడా గుడ్డిదిగా ఉండిపోవ నిశ్చయించింది. ఆమె అన్న శకుని ఆమెను హస్తినాపురానికి తీసుకువచ్చి పెళ్ళి జరిపించాడు. తరవాత శకుని భీష్ము డిచ్చిన సత్కారాలన్నీ పొంది, గాంధారిని హస్తినాపురంలో వదిలి, తాను స్వదేశానికి తిరిగిపోయాడు.

ఇక పాండురాజుకు వివాహం కావలసి ఉన్నది. భీష్ముడికి కుంతి అనే యాదవ కన్యను గురించి తెలియ వచ్చింది.

యాదవ ప్రముఖులలో ఒకడైన శూరు డనేవాడు వసుదేవుడి తండ్రి. ఆయనకు పృథ అనే కూతురున్నది. శూరుడి మేనత్త కొడుకు కుంతిభోజు డనేవాడికి పిల్లలు లేక పోగా అతను ఈ పృథను తన కూతురుగా పెంచుకున్నాడు. కుంతిభోజుడి ఇంటికి వచ్చేపోయేవారి కందరికీ పృథ అతిథి సత్కారాలు చేస్తూ ఉండేది. అలాగే ఒక సారి దూర్వాసుడు వచ్చి, ఆమె చేసిన సత్కారాలకు సంతోషించి, ఆమెకు ఒక మంత్రం చెప్పి, "అమ్మాయీ, ఈ మంత్రాన్ని పునశ్చరణ చేసి జపించావంటే నువు ఏ దేవుణ్ణి కోరితే ఆ దేవుడు వచ్చి నీకు ఒక గొప్ప కొడుకును ప్రసాదిస్తాడు," అని చెప్పాడు.

ముని మాట నిజమో కాదో చూతామని ఆ కుంతి ఒకనాడు సూర్యుణ్ణి మనసులో పెట్టుకుని మంత్రం జపించింది. వెంటనే సూర్యుడు ఆమె ఎదట ప్రత్యక్షమయాడు. ఆమె కొడుకును కోరలేదు. అయినా సూర్యుడి వల్ల గర్భవతి కావటం తప్పలేదు. సకాలంలో ఆమెకు కవచకుండలాలు గల



కొడుకు పుట్టాడు. ఏం చెయ్యాలో తెలియక వాణ్ణి ఒక పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను ఒక తెప్పకు కట్టి నదీ ప్రవాహంలో వదిలింది. అది ఒక సూతుడికి దొరికింది. సూతుడు ఆ పెట్టెలో చిన్న సూర్యుడిలాటి పిల్లవాడుండటం గమనించి, ఆ పిల్లవాణ్ణి తన భార్య అయిన రాధ అనే ఆమెకిచ్చాడు. ఆమె ఆ కుర్రవాణ్ణి పెంచింది. అతనే కర్ణుడు.

ఇది జరిగాక కుంతిభోజుడు తన కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. దానికి పాండుడు కూడా వెళ్ళాడు. కురువంశంలో పుట్టి, ఎంతో అందంగానూ, వైభవోపేతుడుగానూ కనిపించిన పాండుడి మెడలో కుంతి వరమాల వేసింది. కుంతిభోజుడా యిద్దరికీ ఘనంగా పెళ్ళిచేసి, అంతులేని కానుకలతో హస్తినాపురానికి పంపాడు. కుంతి కోసం ఒక ప్రత్యేకమైన అంతఃపురం ఏర్పాటయింది. అందులో కుంతీ పాండులు సమస్త సుఖాలూ అనుభవించసాగారు.

పాండుడికి మరొక భార్యను కూడా పెళ్ళిచేయాలని భీష్ముడు నిశ్చయించాడు. మద్రరాజైన శల్యుడికి ఒక చెల్లెలున్నది. భీష్ముడు పెద్ద పరివారంతో శల్యుడి రాజధానికి బయలుదేరి వెళ్ళాడు.

శల్యుడు భీష్ముడికి ఎదురువచ్చి, స్వాగతం తెలిపి తీసుకుపోయి, ఆయన వచ్చిన పని అడిగాడు.

"నీ చెల్లెలు మాద్రిని మా పాండురాజుకిచ్చి పెళ్ళిచెయ్యి," అన్నాడు భీష్ముడు.

"అంతకంటె నాకైనా కావలిసినదేమున్నది? అయితే కన్యాశుల్కం పుచ్చుకోవటం మా వంశాచారం. కన్యాశుల్కం ఇచ్చి మా చెల్లెలిని తీసుకుపోయి మీ ఇంట వివాహం చేసుకోండి," అన్నాడు శల్యుడు.

వంశాచారాలను పాటించక తప్పదు గనక భీష్ముడు మద్రరాజుకు బంగారమూ,



రత్నాభరణాలూ, వస్త్రవాహనాలూ పుష్కలంగా ఇచ్చి, మాద్రిని హస్తినాపురానికి తెచ్చి, ఒక శుభముహూర్తాన పాండురాజు కిచ్చి వివాహం చేశాడు. పాండురాజు తన ఇద్దరు భార్యలతోనూ సుఖంగా కాలం గడపసాగాడు.

భార్యలతో ఒకనెల పాటు సుఖంగా గడిపిన తరవాత పాండురాజుకు దిగ్విజయం చెయ్యాలన్న కోరిక కలిగింది. అతను చతురంగ బలాలను సమకూర్చుకుని, ప్రయాణభేరి మోగించి, భీష్ముడు మొదలైన వారికీ, బ్రాహ్మణులకూ మొక్కి, మొదటగా దశార్ణదేశాలను జయించాడు. తరవాత మగధదేశం మీద దండెత్తి, మగధ రాజును చంపాడు. మగధ, కాశీ, పుండ్ర మొదలైన దేశాలు జయించి, అంతులేని కానుకలనూ, కప్పాలనూ పుచ్చుకుని పాండురాజు హస్తినాపురానికి తిరిగి వచ్చాడు. భీష్ముడు మొదలైన పెద్దలు పాండుడికి ఎదురువచ్చి గొప్పగా సన్మానించారు. పాండురాజు తాను వివిధ దేశాలలో కొల్లగొట్టిన సంపదను భీష్ముడికీ, సత్యవతికీ, విదురుడికీ, తమ తల్లులకూ పంచాడు. అందరూ సంతోషించారు. ఆ ధనంతోనే ధృతరాష్ట్రుడు అనేక అశ్వమేధాలు చేశాడు.

తరవాత పాండురాజు తన యిద్దరు భార్యలనూ వెంట బెట్టుకుని విహారం చెయ్యటానికి హిమవత్ప్రాంతంలోని అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ అతను చాలా కాలం ఉన్నాడు. అతనికి అవసరమైన వస్తువులను ధృతరాష్ట్రుడు పంపుతూ వచ్చాడు.

అక్కడ హస్తినాపురంలో భీష్ముడు విదురుడికి దేవకుడనే రాజు యొక్క కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు.

ఒకనాడు ధృతరాష్ట్రుడి ఇంటికి వ్యాసుడు చాలా ఆకలితో వచ్చాడు. గాంధారి అయు

నకు సకలోపచారాలు చేసి సంతోష పెట్టింది. వ్యాసు డామెను వర మేదన్నా కోరుకోమన్నాడు. గాంధారి తన భర్తకు తీసిపోని కొడుకులను నూరుమందిని కోరింది.

తరవాత కొంత కాలానికి గాంధారి గర్భవతి అయింది. ఆమె రెండేళ్ళపాటు గర్భాన్ని మోసింది. ఈ లోపుగానే కుంతికి యుధిష్ఠిరుడు పుట్టినట్టు వార్త వచ్చింది. వ్యాసుడు వరమిచ్చినా కూడా తన కింకా ప్రసవం కాలేదని బాధపడి, గాంధారి తన భర్తతోనైనా సంప్రతించకుండా, తన గర్భాన్ని గట్టిగా కొట్టుకున్నది. అందువల్ల ఆమెకు గర్భ స్రావమయింది. రెండేళ్ళు కష్టపడి మోసిన ఆ పిండం తాలూకు ఖండాలను ఆమె పారేద్దామనుకున్నది. ధృతరాష్ట్రుణ్ణి చూడవచ్చిన వ్యాసుడి కీ సంగతి తెలిసింది.

"ఏమిటి నువు చేస్తున్న పని?" అని ఆయన గాంధారి నడిగాడు.

గాంధారి ఏడుస్తూ, "మీరు నాకు నూరుగురు కొడుకులు కలిగేటట్టు వరమిచ్చారు. నేను రెండేళ్ళు గర్భవతిగా ఉండి కూడా పిల్లలను కనలేదు. ఇంతలో పాండురాజు భార్య అయిన కుంతికి చక్కని కొడుకు పుట్టినట్లు తెలిసింది. ఆ విచారంతో



నా పొట్టను నేనే కొట్టుకుని గర్భస్రావం చేసుకున్నాను. మీ వరం మాట ఏమో గాని ఈ గర్భం ఇలా ముక్కలు చెక్కలయింది," అన్నది.

"నా వరం ఎన్నటికీ వ్యర్థం కాదు," అంటూ వ్యాసుడు, గాంధారీ గర్భం నుంచి పడిన మాంస ఖండాలను నూరింటినీ చక్కగా చన్నీట కడిగించి, ఒక్కొక్క ఖండాన్ని ఒక్కొక్క నేతికుండలో పెట్టించసాగాడు. అప్పుడు గాంధారి ఆయనతో, "ఈ నూరు ఖండాలూ నూరుగురు పిల్లలవుతారు కాబోలు. వారితోబాటు ఒక ఆడపిల్ల కూడా కలిగేటట్టు అనుగ్రహించండి.



దౌహిత్రుల వల్ల కూడా పుణ్యలోకాలు కలుగుతాయి," అన్నది.

ఆమె కోరిక సిద్ధించాలని వ్యాసుడు దీవించాడు. స్రావమైన గర్భాన్ని నూట ఒక్క ముక్క చేసి కుండలలో పెట్టించి వ్యాసుడు వెళ్ళిపోయాడు.

తరవాత ఒక్క సంవత్సరం గడిచే సరికి ఒక కుండ నుంచి మొదటి పిల్లవాడు పుట్టాడు. వాడు పుట్టగానే అనేక దుశ్శకునాలు కనబడ్డాయి. వాటిని చూసి ధృతరాష్ట్రుడు భయపడి, భీష్ముణ్ణీ, విదురుణ్ణీ, మంత్రులనూ, పురోహితులనూ పిలిపించి, "ఇదివరకే మా వంశంలో యుధిష్ఠిరుడు పుట్టాడుగదా, ఇప్పుడు పుట్టినవాడికి రాజ్యార్హత ఉంటుందా? కొంచెం ఆలోచించి చెప్పండి," అని అడిగాడు.

దానికి వాళ్ళు, "మహారాజా, వీడు పుట్టగానే దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. వీడు వంశనాశకుడు. వీణ్ణి వదిలెయ్యి. నూరుమంది కొడుకులలో ఒకడు లేకపోతేనేం?" అని అన్నారు. విదురుడు కూడా ఆ మాటే చెప్పాడు. కాని పుత్రప్రేమ కొద్దీ ధృతరాష్ట్రుడు వాళ్ళ మాటలు వినిపించుకోలేదు.

ఆ విధంగా మొట్టమొదట దుర్యోధనుడు పుట్టాడు. తరవాత క్రమంగా దుశ్శాసనుడూ, దుస్సహుడూ మొదలుగాగల కొడుకులూ, దుశ్శల అనే కూతురూ పుట్టారు.

గాంధారి గర్భవతిగా ఉన్న కాలంలో ఆమెకు బదులుగా తనకు పరిచర్యలు చెయ్యటానికి ధృతరాష్ట్రుడు ఒక వైశ్య స్త్రీని చేరదీశాడు. దుర్యోధనాదులు పుట్టిన యేడే ఆ స్త్రీ ధృతరాష్ట్రుడికి యుయుత్సుడనేవాణ్ణి కన్నది.

ధృతరాష్ట్రుడు తన కొడుకుల కందరికీ రాజోచిత విద్యలు నేర్పించి, వారి కందరికీ తగిన కన్యలను తెచ్చి వైభవంగా పెళ్లిళ్లు కూడా చేశాడు.





# గాంధీ కథ

## 5

రానున్నదేమిటో గాంధీ చెప్పినాక అక్కడి వర్తకులు అతన్ని వెళ్ళిపోవద్దనీ, అక్కడే ఉండి తమ తరఫున పోరాటం సాగించమనీ బతిమాలారు. గాంధీ తన ప్రయాణాన్ని ఒక నెలపాటు వాయిదా వేసుకున్నాడు. ఈ లోపల భారతీయ వ్యతిరేక బిల్లు ప్రవేశ పెట్టబడవచ్చు.

వీడ్కోలు విందు కాస్తా రాజకీయ సమావేశంగా మారి, రానున్న బిల్లును ప్రతిఘటించే పథకాలు ఆలోచించింది. ప్రిటోరియాలో ఉన్నసమయంలో గాంధీ భారతీయ వలసదార్ల సమస్యలను క్షుణ్ణంగా అర్థం చేసుకున్నవాడు కావటంచేత తాను నడపదలచిన రాజకీయ ఉద్యమ స్వరూపాన్ని దివ్యంగా నిర్ణయించాడు. అందులో మొదటి మెట్టు, నానాగోత్రీకులుగా ఉన్న భారతీయ పౌరుల మధ్య సంఘీభావం ఏర్పరచటం. వారిలో హిందువులూ, ముస్లిములూ, పార్సీలూ, మద్రాసు నుంచి వచ్చిన కూలి జనమూ, గుమాస్తాలూ, వర్తకులూ, క్రిస్టియనులూ ఉన్నారు; వీరంతా తాము భారతీయులమేనన్న భావంతో మెలగాలి. రెండు, భారతీయులకు వోటింగుహక్కు లేకుండా చెయ్యటంవల్ల కలిగే పరిణామ ఫలితాలను భారతీయులకూ, వివేచనాశక్తిగల తెల్లవాళ్ళకూ, నేటాలు ప్రభుత్వానికీ కూడా తెలిసివచ్చేటట్టు చెయ్యాలి. మూడు, భారతీయుల పరిస్థితిని గురించి విస్తృతమైన ప్రచారం జరిగి, భారతదేశంలోనూ, గ్రేట్ బ్రిటనులోనూ ఉండే ప్రజలా, ప్రభుత్వాలా అంతరాత్మలను చైతన్యవంతం చెయ్యాలి. ఇండియా ప్రభుత్వానికి స్వతంత్ర ప్రతిపత్తి లేదు. కాని నేటాలులోని తెల్లవాళ్ళ ప్రయోజనాల కొరకు భారత ప్రభుత్వం అనేక



మంది భారతీయులను వలస పోనిచ్చిన కారణంచేత వారి మంచి చెడ్డలకు నైతిక బాధ్యతవహించి ఉన్నది. ఇక నేటాలు శాసనసభలు చేసే చట్టాలను తలచుకుంటే కొట్టి పారెయ్యగల అధికారం బ్రిటిషుప్రభుత్వానికున్నది. దక్షిణాఫ్రికాలోని భారతీయులను జాతివివక్షత నుంచి బ్రిటిషు ప్రభుత్వం కాపాడేలాగు చేయటం సాధ్యమవుతుందని గాంధీ అనుకున్నాడు.

తన ప్రచారంలో గాంధీ ఎలాటి దక్షత కనబరిచాడంటే, 1894 డిసెంబరులో జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసు సమావేశంలో భారతీయ వ్యతిరేక బిల్లును గర్హిస్తూ ఒక తీర్మానం జరిగింది; లండను లోని "టైమ్స్" పత్రిక దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యలమీద మూడేళ్ళ కాలంలో ఎనిమిదిసార్లు సంపాదకీయాలు రాసింది.

నేటాలు శాసనసభకు సమర్పించటానికి గాంధీ తయారు చేసిన పిటిషనుపై 400 నుంది భారతీయులు సంతకాలు పెట్టారు.

ఈ పిటిషను నేటాలు శాసనసభలోనూ, ప్రభుత్వంలోనూ చాలా అలజడీ, అంటో ళనా రేకెత్తించింది. కాని బిల్లు మాత్రం పాసయింది.

అయినా ఇంకా ఒక్క ఆశాలేశం మిగిలి ఉన్నది. నేటాలు శాసనసభలో నెగ్గిన ఈ బిల్లు, విక్టోరియా రాణి సంతకం చేస్తేనే గాని చట్టం కాదు. బ్రిటిషు వలసల మంత్రికి ఒక మహా విజ్ఞాపన పంపటానికి గాంధీ నిశ్చయించాడు. దానిపైన 10,000 మంది భారతీయులు—ఇంచుమించు నేటాలలో ఉన్న భారతీయు లందరూ—సంతకాలు చేశారు. గాంధీకి కావలిసింది ప్రజలలో రాజకీయ చైతన్యం; పిటిషను యొక్క ప్రయోజనాన్ని పూర్తిగా అర్థం చేసుకోకుండా ఎవరినీ అతను సంతకం చెయ్యనివ్వలేదు. ఈ మహా విజ్ఞాపన వెయ్యి కాపీలు అచ్చు వేసి, ప్రముఖ రాజకీయ వాదులకూ,

ఇండియా, బ్రిటనులలోని పత్రికలకూ పంపారు. నేటాలు భారతీయులను గురించి భారతదేశంలోనూ, బ్రిటనులోనూ కూడా మంచి ప్రచారం జరిగింది.

ఈ లోపుగా గాంధీ తన ప్రయాణానికి వేసుకున్న నెల వాయిదా ముగిసింది. నేటాలు భారతీయులు అతన్ని ఉండి పొమ్మని బతిమాలారు. బ్రిటిషు ప్రభుత్వం ఈ బిల్లును ఆమోదించదని చెప్పటానికి లేదు. ఇంకా ఎన్ని దురన్యాయాలైనా జరగ వచ్చు. గాంధీ ఇప్పుడు వెళ్ళిపోతే ఆయన ఈ నెల రోజులూ పడిన శ్రమ యావత్తూ బూడిదలో పోసిన పన్నీరవుతుంది.

గాంధీ ఉండి పోవటానికి అభ్యంతరం లేదు. కాని ఆయనకు ఎలా జరుగుబాటు అయేటట్టు? ఆయనకు ఏడాదికి 300 పౌనులుంటే గాని జరగదు. ఇరవైమంది వర్తకులు కలిసి ఆయన ఖర్చు గడిపే టందుకు సమ్మతించారు.

గాంధీ సుప్రీం కోర్టులో ప్రాక్టీసు చెయ్యటానికి అర్జీ పెట్టుకున్నాడు. నేటాలులోని బారు సొసైటీ అభ్యంతరం చెప్పింది. ప్రధాన న్యాయమూర్తి అభ్యంతరం చెప్ప లేదు గాని గాంధీ కోర్టులో తలపాగా ధరించ రాదని నిషేధించాడు. గాంధీ యిందుకు సమ్మతించాడు.



ఒకనా డతనికి తలపాగా తీసెయ్యటం అవమానంగా తోచింది. కాని ఈనా డతను అంతకన్న చాలా ముఖ్య విషయాలలో నిమగ్నుడై ఉన్నాడు.

నేటాలు భారతీయుల తరఫున ఒక శాశ్వత సంస్థ ఉండటం అవసరమని తోచి నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ అనే సంస్థను ఏర్పాటు చేశాడు. ఇండియన్ నేషనల్ కాంగ్రెసు నియమావళి గాని, ఆశయాలు గాని గాంధీకి తెలియవు. అందుచేత ఆయన నేటాల్ ఇండియన్ కాంగ్రెస్‌ను అక్కడి భారతీయుల అవసరాల కనుగుణంగా తీర్చి దిద్దాడు. అదీ ఒక మేలే అయింది. ఇండియన్ నేషనల్ కాంగ్రెసు కేవలమూ చర్చావేదికగా ఉండిపోయిన ఆ కాలంలో నేటాల్ కాంగ్రెసు అక్కడి భారతీయుల రాజకీయ, సాంఘిక, నైతికాభివృద్ధికి ఏడాది పొడుగునా కృషిచేసే సంస్థగా రూపొందింది. గాంధీ దానికి కార్యదర్శిగా ఉండి అందరి లోనూ ఉత్సాహశక్తులు పెంపొందించటానికి విసుగు లేకుండా పనిచేశాడు. కొత్త సభ్యులను చేర్చటమూ, చందాలు వసూలు చేయటమూ పవిత్ర కార్యంగా అతను భావించాడు.

రాజకీయ కార్యకర్తగా గాంధీ ఏమీ తీసుకోలేదు. జీతం మీద పనిచేసినట్టయితే తన స్వాతంత్ర్యం పోతుందని అతను భావించాడు. రాజకీయవాది తన పక్షం యొక్క తప్పులను కూడా సమర్థించాలన్న సూత్రాన్ని అతను ఒప్పుకోలేదు. నిజాయితీకి అత్యంత ప్రాముఖ్యం ఇచ్చాడు. తన అనుచరుల అతిశయోక్తులను నిరుత్సాహపరిచాడు. తాను వారిలోని లోపాలను నిర్దాక్షిణ్యంగా విమర్శించాడు. వాళ్ళు తమ ఆర్థిక, రాజకీయ హక్కుల కోసం పోరాడటంతో బాటు తమ ఐకమత్యాన్నీ, నైతిక ప్రమాణాలనూ కూడా ఎంతగానో పెంపొందించుకోవాలని అతని ఉద్దేశం.



# 92. ప్రాచీన గ్రీకు శిల్పాలు



శిల్ప సౌందర్యాన్ని గ్రీకులు సాధించినట్టుగా మరెవరూ సాధించలేదని చెప్పాలి. వారి ఆలయాలూ, అర్చనమందిరాలూ మాత్రమే గాక, చిన్న పాత్రలూ, కూజాలూ, వంటపాత్రలూ కూడా శిల్పాలు కలిగి ఉండేవి. గ్రీకులు తమ శిల్పాలను చలవరాతితోనూ, కంచుతోనూ నిర్మించారు. ఇక్కడ చూపిన శిల్పాలు క్రీస్తుపూర్వం మూడవ శతాబ్ది నాటివి. గుర్రం మీద సవారి చేసే బాలుడు. గ్రీకుదేవతలకు పెద్ద అయిన జియస్ కాని, అతని సోదరుడైన సముద్రదేవుడు (మన వరుణుడు) కాని కావాలి. ఈ రెండు శిల్పాలూ సముద్రం అడుగున దొరికాయి.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

ప్రశ్న

పంపినవారు:
ఎస్. సి. ఈరన్నరావు, క్రిష్టిపాడు

Photo by P. Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

జవాబు

పంపినవారు:
ఎస్. సి. ఈరన్నరావు, క్రిష్టిపాడు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జులై నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జులై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ప్రశ్న

రెండవ ఫోటో: జవాబు

పంపినవారు: ఎస్. సి. ఈరన్నరావు,

క్రిష్టిపాడు. (అనంతపురం జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road. Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# కొంగ-నక్క

(నీతికథ మరోసారి)

రాజు అడవిలో నివసించే జీవుల మారి నక్క తనతో అడవిలో నివసించే వారిని వేళాకోళం చేస్తుంటూ ఉండేది. ఒకనాడు... 1

అవమానకరమైన కొంగ శంకర్‌ని విందుకు పిలిచి పలచటి పళ్ళెంలో వడ్డించింది



2




3

వెంటనే శంకర్ రాజుని విందుకేం పిలిచి...

4

...ఆశగొల్పించే బ్రూక్ బాండ్ A-1 డస్ట్ తేనీటిని ఇచ్చింది... నిడుపాటి మెడగల కూజాలలో!




5

రాజుకు బాగా తెలిసింది పాఠము




6




రాజుకి అహంకారం తగ్గింది— అందరికీ సమానంగా రుచికరమైన A-1 డస్ట్ టీతో విందు చేస్తున్నాడు. 7

క్రొత్తవి!

రుచిగా గరగరలాడే
ఉప్పు బిస్కట్లు

బ్రిటానియా చక్ర

ఒక్కటి రుచిచూస్తే
ఇంకొకటి మరొకటి - మరొకటీన్నీ

మీకే తెలుసు నోటిలో వేసుకొనే చిన్న సైజు ఉప్పుబిస్కట్లరుచి. వాటిని నోటిలో నములుతుండాలనిపిస్తుంది. బ్రిటానియా చక్ర బిస్కట్లు అటువంటివే అతి తేలికగా నోటిలో కరిగిపోతూ, గరగరలాడుతూ రుచిగా వుంటాయి. దోసెడు దోసెడు తింటారు. ప్లేట్లునిండా తింటారు ఇకచాలు అనేమాటేలేదు.



బ్రిటానియా అంటే నాణ్యత

BBC-8484 TEL

# చందమామ

ఇప్పుడు **6** భాషలలో ప్రతినెలా వెలువడుతున్నది.

తెలుగు - కన్నడము - తమిళము

హిందీ - మహరాష్ట్ర - గుజరాతి



చందమామ నెలనెలా **2,50,000** గృహాలను అలంకరిస్తుంది



మీ వ్యాపార సందేశాన్ని అందించటానికి

ఇది శక్తివంతమైన ప్రచారసాధనం

వివరములకు :

## డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'  మదరాసు - 26

# సవ్యమైన పెంపకానికి రక్తి
# బోర్న్‌విటా శక్తి !

ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్






Bensons/0391 TEL

**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా !**

# ఫోస్‌ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని హెచ్చించును.



శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్‌ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్‌ఫేట్లుగల అకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




SQUIBB TIT

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A /67 Tel

